Bihar ... 20/06

# శాశ్వతపు చందాదారుల సమకూర్చువారికిఁ బ్రోత్సాహము.

1. మా గ్రం... ఐదుగురు శాశ్వతపు చందాదారుల సమ... వారి ... వేగుంజుక్కయొక్క రెండవమరీచిక..., ... ని రు... క ...వల నుచితముగ నిత్తుము. పదుగుర... ప్రచురించు గ్రంథముల నుచితముగ నిత్తుము. ...చ్చువారు మా గ్రంథమాలకు శాశ్వతముగ నుచితపుచందాదారు లగుచున్నారు.

2. ఇరువదియైదుగురుకన్న నెక్కుడువ... ర్చువారికి, మామండలివారు, బహుమానమునిత్తురు.

3. ఏఁబదికిమించిన చందాదారుల ...ర్చువారు మాసమాజమునకు, వారిష్ట పడినచో పోషకులగుచున్నారు.

4. శాశ్వతపు చందాదారులను సమకూర్చు సామర్థ్యము గలవారు, ఏజంట్లుగాఁ బనిచేయఁగోరినచో, వారికిఁ దగిన కమీషనుగాని ...తము గాని ...యఁబడును.

5. తాము సమకూర్చు శాశ్వతపు చందాదారులు మా గ్రంథమ... గొనువారుగా నుండవలెను,

## ప్రచురింపఁబడిన గ్రంథములు.

ఉషఃకాలము (THE DAWN):—కలభాషిణియను పేర నాంధ్రభాష, స్వీయచరిత్రఁ జెప్పుచుండినటుల వ్రాయఁబడిన యాంధ్రభాషాచరిత్ర. సంపాదకప్రణీతము, 233 పేజీలుగలిగి, "ఫెదర్ వైటు" కాగితమ... ముద్రింపఁబడిన వచనకావ్యము. వెల చందాదారులకు 0-14-0. ఇతరులకు 1-... పోస్టేజీకాక.

వాఁడే వీఁడు (THIS IS HE) :—అపూర్వమగు ... నవల ఆంధ్రభాష యిదివఱకెన్నఁడెఱుంగదు. దీనిఁ జదువ బ్రారంభించినచో ...లు ముగించువఱకు మూయ మనసొప్పదు. కావ్యదర్శిప్రణీతము. కథాసందర్భానుసారము వేయఁబడిన 'హాఫ్‌టోన్ బ్లాక్' కలిగి 272 పేజీలుగలచిత్రమగు వచనప్రబంధము. వెలచందాదారులకు 0-12-0 ఇతరులకు 1-2-0 పోస్టేజీకాక.

## ఇతర విషయములు.

1. అన్యోన్యసహాయప్రకటనలకు తావొసంగుదుము. ఇతరుల ప్రకటనలకు సరసమగుధరల కారుచౌకచేసి యేర్పఱచినాము.

VI

# అచ్చునకున్న గ్రంథములు.

మనోవినాశము—స్వభావోన్మీలనము (Development of Character) గలిగిన మనోహరమగు రాజప్రత్రస్థాన విషయిక నవల.

సుహృల్లత—అతి మనోహరమైన కల్పితకథ. స్నేహము, దాని పరిణామములు కడురమ్యముగ నుగ్గడింపఁబడినవి. లోకమున స్నేహితుల కెట్టి కడగండ్లు సంభవించునో యీపొత్తమున వ్యక్తీకరింపఁబడినవి. శైలి కడుంగడు హృదయరంజకముగా నుండును. కల్పనాచమత్కారము అనన్యసామాన్యము.

# రాఁబోవు గ్రంథములు.

అమాత్యసాగరము—తెనుంగుబాస మున్నెన్నఁడెఱుంగని విషాదాంత నాటకము. 5 అంకముల కల్పితకథ. కథాకల్పనము ముద్రారాక్షసమును వెనుకదీయదు. కల్పనాచమత్కారము షేక్స్పియరు మహాకవి తన గొప్పనాటకముల గనుపరచినదానికి సరియగును. స్వభావనిరూపణ, మనోప్రదర్శనాది యుత్కృష్ట విషయములతో గూడుకొని యాంధ్రనాటకములలో మిగుల ప్రశంసనీయమయి యుండుట చదివిన వారలకెల్లరకుం దెలియగలదు. పద్యము లతిమనోహరములు. శైలిహృదయరంజకము అనేక నాటకంబులకు మార్గదర్శికానున్న నాటకరాజము. పలుగాణాం గ్రంథాపల నారితేరిన వారిచే విరచితము

పరిణయము—పెక్కు వత్సరములకు ముందు రచింపఁబడిన పద్యకావ్యము. అనర్గళమగుధారయు, తేనెలూరు పదములును, మనోహరములగు కల్పనలునుగలిగి యయిదాశ్వాసముల విరాజిల్లుచున్నది. ఋతువులయందలి ప్రకృతివర్ణనలు చదువదగియున్నవి. ఇందలి యలంకారములమితానంద దాయకంబులు.

దేవరాజు — వేంకటకృష్ణారావు,

వేగుఁజుక్క గ్రంథమండలి. కార్యదర్శి, బరంపురము.

## (c) నియమములు.

హాస్య - శాంతకరుణరసప్రధానముల కీనాటికవారికై నియమ గ్రంథ్యసంయమ పరిగ్రహింపబడినది. గ్రంథమున నిర్దిష్టములగు నియమములు, ఇతర స్థలములలో నుపయోగింపబడవని నాయుద్దేశము.

## (d) చరిత్రాంశములు.

కర్ణమూల యను పేరుగల యొకానొక కన్యక, తాను గామించిన భర్తను పెండ్లియాడలేక, మఱియొకనిఁ బెండ్లియాడ నిచ్చగింపక, కంచిలియను గ్రామమునందలి గుండములోఁ బడి ప్రాణత్యాగమున మరణించియుండెనని, కంచిలీగ్రామమున పెద్దలు చెప్పుదురు. నేను కంచిలిలో సాల్టుసబ్ యిన్స్పెక్టరుగా నున్నప్పుడు, ఈకథను విని, దీనిని నాటకముగాఁ జేయ నెంచుచుంటిని. నేటికి నా మనోరథ మీడేరెను. ఇందలి చరిత్రాంశ మింతియే. కాని, శ్రీకాకుళములోని నవాబులను, జలంత్రాలోని రాజులను వర్ణించియుంటచే, నవియన్నియును చరిత్రాంశములే యని భ్రమింపవలదని, పాఠకులను బ్రార్థించుచున్నాను.

## (e) కృతజ్ఞత.

ఈనాటకరచనయందు నాకు గురువువలె నుపకారమొనర్చిన శ్రీ కి... య్యారుమహాశయునకు సాష్టాంగనమస్కారములు చేయుచున్నాను. కవితావిద్యాగురువులగు మత్పితామహులకు నీకృతి యంకితమీయఁబడినది. కావున, వారిప్రతిబింబ మిందు నిల్పఁబడినది. పార్వతీశ్వరకవిగారిబ్లాకును నాకు నుచితముగా నొసంగి, వారిప్రతిబింబములను నిరంతరమును దర్శించుభాగ్యము నాకుఁ గల్గఁ జేయుటయేకాక, భగవత్స్వరూపులగు నమ్మహామహునిదర్శనభాగ్యము నాంధ్రలోకమునకును మఱియొకసారి కలిగించిన శ్రీ యాంధ్రపత్రికాధిపతి గారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈనాటకమును బ్రచురించి, నాకు నుపకారమొనర్చిన వేగుఁజుక్క గ్రంథమండలివారికి నేనెంతయును గృతజ్ఞుఁడను.

గ్రంథకర్త.

# పాత్రలు.

## పురుషులు.

(1) ప్రభాకరుఁడు—కథానాయకుఁడు.
(2) అరుణాచలశాస్త్రి—ప్రభాకరునితండ్రి.
(3) నాగరశాస్త్రి—సరోజినితండ్రి.
(4) వామనశాస్త్రి-సరోజినిఁ బెండ్లియాడ నెంచినవృద్ధుఁడు.
(5) నవాబు—శ్రీకాకుళమునవాబు.

## స్త్రీలు.

(1) సరోజిని—కథానాయిక.
(2) పద్మలత—సరోజినితల్లి.
(3) సంధ్యాదేవి—ప్రభాకరునితల్లి.
(4) దాసి- సరోజినియింట పరిచారిక.
(5) వృద్ధపరిచారిక } కుముదిని పరిచారికలు.
(6) చతుర }
(7) కుముదిని—నవాబుపెండ్లియాడిన క్షత్రియ స్త్రీ.

రాజభటులు, జెయిలుభటులు, పెండ్లివారు, వగైరా

సరోజిని పురుష వేషము, చతుర పురుషవేషము.

## స్థలములు.

కంచిలి, శ్రీకాకుళము.

శ్రీ

# చిన్న విన్నపము.

ఆంధ్రమహాజనులారా!

కాలమెంత విపరీతముగనున్నది! ఊరకుందమన్న నుండనీయక ముందునకు లాగుచున్నయది. సరియే——విన్న వింతుము.

తొలుత వేగుఁజుక్క కార్యదర్శిగారు శ్రీమంతులు బాలకవి భోగరాజు-నారాయణమూర్తిగారితో, "అయ్యా, తమరొక నాటకము వ్రాయఁగూడదా, మా కమిటీ వారంగీకరించినచో నద్దానిం బ్రచురింతు"మని, యడుగుట వాస్తవమే. అందునకు శ్రీ. బా. భో. నా. గారు-9 రోజులలో నొక నాటకమును వ్రాసినారట. ఆ నాటకమును మాయెదుట చదువునపుడు, వారా గ్రంథమున కొక నామమిడిరి. ఆ నామకరణముజూచి, మేము, "అయ్యా! యీ పేరీ గ్రంథమున కెంతవరకుఁ దగియున్నది," అన, "అదియేమో కాని, పేరుమాత్రము నాకు చాలా ప్రియముగానున్నది. కాన లవంగియనియే యుండవలెననియు, "అయ్యా! యీ ప్రయోగము సరియా!" యన, "లక్షలకొలది భారతమున ప్రయోగములు చూపగలను గాని యిప్పుడు చెప్పలే'ననియు, ఇన్ని మారువేషములేటికండీ? చదువరులకుగాని, ప్రదర్శకులకుగాని, గ్రంథకర్తలగు తమకుగాని ప్రయోజనములేదే!" యన, అమ్మమ్మా! ఉండనియ్యండీ - అది యన్నుగుమ్మ అయిపోతారండీ" యనియు, అయ్యా, వీరిట్లు చేయుట సరియా? యన, "మా ప్రతాపుడును, మాలవంగియు నిట్లే చేసి"రనియు, ఈ కల్పన నించుక సవరించిన బాగుగనుండు" నన, "అబ్బబ్బా! పద్యము నాల్గునాళ్లాలోచించి యాలోచించి, వ్రాసితిని కాన దానిని మార్పరాదనియు, "ఇట్లగుట యసంభవంబగునేమో?" యన, "అంత పరిశీలించి చూచువారెవరుందురు? ఉండిన నుండనిం"డనియు, * * * ంపు, ప్రత్యుత్తరము లొసంగుచున్నను, తుదకు, "ఎందునుగాకున్న కథావిషయమున నైనం గొన్ని మార్పులు జేయవలసియున్నది. రసభంగములు, చరిత్రావిషయికపు నసందర్భములు, స్వభావనిర్మాణోన్మీలనాదుల పోషణల కత్యంతంబగు భంగంబుగలుగుచున్నవని మే మనుటయు, వారందుల కంగీకరింమటయుఁ దటస్థించినవి. కాని వారియనుమతి ప్రకారము నాటకమును మార్పకయే, కథను సవరింప మాకును కాలాడకయుండెను.

ఇంక కార్యార్థిభారము వహించియున్న తామే యుదాసీనభావంబు నందియుండ, సంపాదక కార్యదర్శులు వారియింటికిపోయి, 'ఆర్యవర్యా? మీరు చేయవలసిన మార్పులివి' యని యనకపోవుటయు చింత్యమేకదా!

పోనిండా మార్పులు లేకయే, యాగ్రంథమును మీకు పంపుదుమన్న ఆర్యులారా! మీ ధనము అంతత్రుప్పును పట్టియున్నదా? తా మొసంగు 9 అణాలకును, తమకొకలోకస్వభావవిషయమో, లేక యొకానొకచక్కని నీతియో, యొసగి చదువరుల మనముల నావంతయైన నుత్కృష్టదశకు తీసికొని రాకపోయిన, నీ వేగుంజుక్కమండలి వారెంతయు నిందార్హులుకారా!

కానిచో భాషకు నూతనవిషయమునైన నొసంగవలయునా? ఏదియు లేనిచో నిందులకై మీరలు ధనమేల వ్యయముచేయవలయును, అను విషయంబులు మామనంబుల నుంటచేతను, ఆయన కార్యార్థియయ్యు, నుదాసీనభావంబునందియుంటచేతను, నీ పేరిమము మీ పేరిముడి గాంచ నేగుదెంచినది. లతాంగికిని, ఈ ప్రేమమునకుం గల తారతమ్యము చదువరులెరుంగకపోరు. నిజమాడిననిష్ఠురమగునేమో. మంచికార్యముచేయ నెంచిన నవాంతరములు మెండుకదా! ఆ మరచితిమి. భరతవాక్యంబునకుముందు, కవీశ్వరుని నోటినుండి వెల్వడిన 'దుష్టసమాజ'మునుగూర్చిన పద్యమును చూచినంత, మే మొనర్చిన యీమహాపరాధమును కవిగారెంత యుదారమానసముతో భరించి యెంత యశంబునందిరో మీకే తెలియగలదు. పద్యము అసందర్భమైన నగుగాక.

ఉ. అన్నలవంగియిట్లు మము♦నందర నొక్కటనే మహోను భా
వోన్నతి నొందఁజేసి చటు♦లోద్ధురనిష్ఠురవాక్యకాండ సం
విన్నులఁజేయ వెల్వడిత♦వే? ఛళి! నీరసపుత్రికాఖ్య మే
లెన్నగరాదె తోడిజల♦జేక్షణలౌనని మెచ్చుచుండఁగన్.

* కాక, లతాంగి-ఈమార్పులవలన ఛందోభంగము గాదుగదా.

N. B:—మీదిపద్యమున కామాలుపెట్టుట మరచినాము. చదువరులు తమ యిచ్ఛానుసారముగ కామాలనుపెట్టి చదువుకొన బ్రార్థితులు:—

NOTE.—కవిగారింతతోనైన దృప్తినొందక యింకను కయ్యమునకు గాలు ద్రువ్వ సాహసింతురా!

వేగుంజుక్క గ్రంథమండలి.          పుస్తకనిర్ణయ సభవారు.

శ్రీ

"వేగుంజుక్క" గ్రంథమాల.

లోని—

3వ మణి

# ప్రేమము.

అను విషాదాంత నాటిక

ఇయ్యది

మండపాక-పార్వతీశ్వరశాస్త్రిగారిచే
రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

బరంపురము:
శ్రీ స్వేచ్ఛావతీముద్రాక్షరశాలలో
ముద్రింపఁబడినది.

1913

చందాదారులకు
వెల రు 0-6-0
అంచెకూలికాక



ఇతరులకు
వెల రు. 0-9-0.
అంచెకూలికాక

## రాజపోషకులు.

మ. రా. రా. శ్రీ. శ్రీపిఠాపురము రాజావారు.

మ. రా. రా. శ్రీ. శ్రీ సంగమవలస జమీందారుగారు.

## పోషకులు.

మ.రా.రా.శ్రీ. పుక్కెళ్ళ-కమ్మయ్యనాయుడుగారు, బారువ.

మ.రా.రా.శ్రీ. దాసిరాజు-నీలాచలం పంతులుగారి ధర్మపత్ని కీర్తిశేషురాలగు శ్రీమతి రంగనాయకమ్మగారి జ్ఞాపకార్థము.

మ.రా.రా.శ్రీ. దేవరాజు - వేంకట నృసింహారావుపంతులుగారి ధర్మపత్ని కీర్తిశేషురాలగు శ్రీమతి రంగనాయకమ్మగారి జ్ఞాపకార్థము.



"............... a poet hidden
In the light of thought,
Singing hymns unbidden,
Till the world is wrought
To sympathy with hopes and fears it heeded not."

*Shelley.*




# అంకితము.

శ్లో॥ మ త్పితామహ రూపేణ
య స్సర్వజ్ఞో విరాజితః
సమర్పిత మిదం కావ్యం
తస్య పాదాబ్జ సన్నిధౌ॥

# సంపాదకీయ భూమిక.

---

షా వేంకుజుక్కుప మూఁడవమరీచియగు నీ 'ప్రేమము' నాలుగంకముల నాటికయయి విరాజిల్లుచున్నది. ఒకవంక సంఘావస్థయు నింకొకవంక చారిత్రకవిషయంబును దెలియఁజేయుచు, క్షత్రియేతరులఁ బ్రధానపాత్రలుగాఁ గలిగి, నూతనమార్గావలంబియయి విషాదాంతముగనుండు నిట్టినాటకములు భాషకు నూతనములే యగుఁగదా. ఏవిషయంబునైన బలకరంబుగఁ దెలియఁ జేయు విషాదాంతనాటకంబుల నాంధ్రు లెట్టులాదరింతురో తెలిసికొన నపేక్షలు గోరుచుంట యెఱింగినవిషయమే.

ఈ గ్రంథమందలి కొన్ని భాగములు షేక్స్పియరు వ్రాసిన 'రోమియో జూల్యెట్' అను నాటకమును స్మృతికిఁ దెచ్చుచుండును. కథాసామ్యముచే గ్రంథకర్తగారు మహాకవిచంద్రవిరచితంబగు నాగ్రంథమునే సహాయార్థము నెన్నికొనుట మిక్కిలిసమంజసమై యున్నది.

నాటకరచనయందుఁ బాటింపఁబడిన నియమములలో 'సంభాషణయందు విస్తారముగఁ బద్యములఁ జొప్పింపఁగూడద'ను నది యొకటిగఁ గానఁగుచున్నది. అన్నిపాత్రలయందును గానఁగు స్వభావనిరూపణంబును, పద్యగద్యంబులయందెక్కుడుగఁ గూర్పఁబడిన మహాశయంబులును, సమయానుసరణంబుగ నటనటఁ బొందుపఱుపఁబడిన హాస్యరసవిషయంబులును గ్రంథకర్తగారికి సంపూర్ణజయము నిచ్చినవని యెన్నఁదగియున్నవి. అల్పాయుష్కులగు సరోజినీప్రభాకరు లెట్టిఘనకార్యంబులనయినఁ జేయఁజాలియుందు రనిమాత్రము చదువరులు మనంబుల నూనవలయును.

ఇట్టిగ్రంథమును మా కొసంగిన గ్రంథకర్తగారికి మాకృతజ్ఞతం దెలుపుచు, నింతవఱకుందు మేము ప్రచురించిన గ్రంథములను జేకొని మాకు ప్రోత్సాహ మొసంగుచున్న భాషాభిమానుల కభివందనంబు లాచరించుచు, నెక్కుడు దయతో మాప్రచురణంబులపైఁ దమ తమయభిప్రాయముల నెఱుంగఁజేసిన ఘనుల కంజలియొనర్చుచు నున్నారము.

బరంపురము.
20—I—1913.

సంపాదకుఁడు.

# ప్రస్తావన.

## (a) ~~విషయములు~~ నామకరణము

ఈనాటికకుఁ గథానాయకుని పేరుతోఁ గాక, "ప్రేమము"ని నామకరణము చేయుటకు, గథలోని ముఖ్యాంశము లన్నియు నొక్క పేరుననే సూచించుటయందలి నాయభిలాషయే కారణము. "ప్రియస్య భావః ప్రేమా" అని నకారాంతపుంలింగశబ్దముగా గ్రహించి, కామినీకాముకులగు సరోజినీ ప్రభాకరుల కొండొరులయందలి యనురాగము వర్ణింపఁబడినది. మరియు, "ప్రీఞ్ తర్పణే" అను ధాతువు నాధారము చేసికొని, నకారాంత నపుంసకలింగముగా గ్రహించి, "ప్రీణనము" అనఁగా సంతోషింపఁజేయుట యనునర్థమునఁ బ్రభాకరునిఁగూడి సంతోషింపనెంచిన కుముదిని మోహమును, ధనలాభమున సంతోషింపనెంచిన సాగరుని విపరీతచరిత్రమును, వర్ణింపఁబడినవి. ఇంతియేకాక, "ప్రేమా నా ప్రియతా హార్దం" అను నమరసింహుని వాక్య మాధారముగాఁ జేసికొని, "హృదయమునందలి యనురాగము, లేక ప్రీతి, స్నేహము" అను నర్థమున, సంధ్యారుణాచలప్రభాకరుల కొండొరులయందలి హృదయధర్మము వర్ణింపఁబడినది.

సరోజినీప్రభాకరుల కొండొరులయందలి ప్రేమమునకు రెండు విఘాతములు సంభవించినవి. మొదటిది, సాగరునకుఁ గల ధనమునందలి ప్రేమముతోడను, రెండవది, కుముదినికిఁ బ్రభాకరునియందుఁ గల ప్రేమముతోడను, నైయున్నవి. ఇందు, మొదటి ఘాతమునకు ఫలము వామనుని వివాహ మాగిపోవుటయును, సరోజిని యింటివారికిఁ దెలియకుండ శ్రీకాకుళమునకుఁ బోవుటయు నైయుండ, రెండవదానికి ఫలము, నాటికాంతమునందు వర్ణింపఁబడిన ప్రధాన పాత్రత్రయమరణమే యైయున్నది. ఈపరిణామములకుఁ గారణము ప్రేమమే యైయున్నందున, నీనాటికకుఁ "ప్రేమము"ని నామకరణము చేయఁబడినది.

## (b) ఉద్దేశము.

ఈనాటిక, "వివాహవిషయములందు స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్య మొసంగవలయును." అను ముఖ్యోద్దేశముతో వ్రాయఁబడినది.

# ప్రే మ పము.

## ప్రథమాంకము.

### ప్రార్థనము.

శా. శ్రీకారుణ్యసుధాకరాయ, భక్తజనసం◆సేవ్యాయ, భావ్యాయ, సా
కారాయ, శుభప్రదాయ, విమలా◆యాద్యాయ, వేద్యాయ, భ
వ్యాకారాయ, పరాత్పరాయ, సుగుణా◆చార్యాయ, వర్యాయ, తే
లోకత్రాణపరాయణాయ, మునిహృ◆ల్లోలాయ, వందామహే.

స్థలము (1) క[illegible]లిలోని శ్రీజగన్నాథస్వామివారి కోవెలలోని
పూఁదోట.

(ప్రవేశము— సరోజిని, యొకరాతి తిన్నెపైఁ గూర్చుండి)

(స్వగతము) అయ్యయ్యో, అందరానిపండునకై యేల యఱ్ఱులుసాఁపుచున్నాను? అమ్మా, భారతమాతా! నీబిడ్డలకు మౌఢ్యమెంతవృద్ధియగుచున్నది?

సీ. జగదీశు విలు వంపఁ◆ జాలువాని వరింతు
ననుచు వైదేహి పల్కాడు నాఁడు
యంత్రమత్స్యపమర్థుఁ◆ డైన వాని వరింతు
ననుచు ద్రౌపద పంత◆మాడు నాఁడు

వరచుకొనుట యెట్లు? పోనిమ్ము, దైవసమానులగుతల్లిదండ్రుల
చేఁ గట్టిపెట్టఁబడినవానినే, దైవసమానునిగా నెంచి, పూజింతు
మన్న-అయ్యయో-తల్లిదండ్రులుకూడ, నిజమగు నభిమానము
తో — యోగ్యుఁడగుపురుషునికై — వెదకుట లేదే! కటకటా!
కన్యాశుల్కమఁట-మాపాలింటి కదియొకటికూడ దాపరించినది.

శా. మాన్యుల్ మెచ్చరు నీపదంబు, నిఁక సా♦మాన్యప్రజల్ పండిత
మ్మన్యుల్ మెచ్చినయంతమాత్రమున నే♦ మాన్యావనీకబ్బునే!
విన్యస్తార్థము నీవవైభవుల నా♦విర్భావముం జేయుటన్,
కన్యాశుల్కము, ధన్యులేరయిన నిన్ ♦ గాల్మిల్వఁగానిత్తురే?

ఆహా! ఏపంటయైనను కన్నెలవంటిపంట కాఁ జాలదు గదా!

సీ. వాలఁ గరమ్ముఁ దాల్చి ♦ పలుపాములం బొంది,
　　దైన గడింపంగ ♦ రాని ధనము;
వడ్డీపైవడ్డీ రాఁ♦ బట్టి, పెట్టెఁబెట్టి
　　దైన సంపాదింప♦ రాని ధనము;
దమ్మిడీ కొకయాబ♦ ద్ధమ్మాడి యైన, వ
　　ర్తకమున గడియింప♦ రాని ధనము;
ఎండలోఁ బడి పడి, ♦ యిల్లువాకిలి వీడి,
　　రాజులొద్దను సేగ♦ రాని ధనము;
గీ. బ్రాహ్మణార్థములం జేసి, ♦ పాయసమ్ము
కుడిచి, లొక్కమ్ము గడియించి♦ కొనిన యొకని
కాఁపుబిడ్డను గట్టిన♦ నబ్బు నకట!
పంటలకుఁ బంట, కన్నెల♦ వంటిపంట.

తల్లిదండ్రులపైఁగల గౌరవంబున నక్కడికైనఁ గన్యా
రతినొంద నెవ్వరియే నొక్కతెకోరిన, నక్కటకక్కటా, గ్రుడ్డి

లో మెల్లయనుచల్లు — ఈషజ్జోపగువానికైన నమ్మెదరా ?

సీ. పాడుమ ముక్కుసుబేది, • బుడుబుడుస్పటినెత్తి
కని బొట్టి యేకయుఁ • గననివాని,
వెండితీగలఁబోలు • పండు వెండ్రుకలపై,
నగరునూనియ వ్రాసి • యాలయవానిఁ
గావడిమోఁతచేఁ • గాయగాచినయట్టి
మెడపైని వల్లెవా • టిడిన వానిఁ
గుహుకుహుధ్వాన మెం • తొక్కఁడుగాఁగ నదినిల్వఁ
బటికిబెల్లము నోట • వైచువానిఁ,

గీ. జప్పిడవుడలు మాటికిఁ • జప్పరించు
ముడుత ముదిమేని ముక్కాలి • ముసలివాని
నొక్కనింగాంచి, వేయార్గ్ల • రొక్కమునకు
నాఁడుబిడ్డల నమ్మెద • రక్కటకట !

సీ. పలుసారులీని మేన్ • పసచెడిపోయిన
పసుల సంతలనమ్ము • వానికన్న
పాడవాడలఁద్రిప్పి, • వాడిపోయినకూర
నార లమ్మెడు భిల్లు • వానికన్న;
మక్కజారినయట్టి • బొక్కగాడిదనమ్మఁ
బనిఁబూను చాకలి • వానికన్న;
జన్మరోగమున మేన్ • చాలించు గ్రామసూ
కర మమ్మఁదిరుగాడు • నెరుకకన్న

గీ. బలుకుపలుకుచుఁ జక్కెర • పలుకుప లాలుకఁ
గలికినగవున నెమ్మోము • కులుకుచుండఁ
గన్నుపండువోసర్చెడు • కన్నపిల్ల
నమ్మువారలు మొరకులై • రక్కటకట !

నాంభోరుహమునుండి వెలువడు వాక్సుధాంబువు కర్ణపుటంబుల నెంత్రాగినను దనివితీరదుగదా. ఆహాహా! ఆహాహా! (మైమరచుచు).

ప్రభా.— కాంతా! ఏల పలుకవు? నాపైఁ గోపమువచ్చెనా?

సరో.— ఏ మట్లనెదవు? మనోహరా! నీపై నాకుఁ గోపమా? నే నిక్కడనున్నాననుసంశయము నీ కెవ్వరు చెప్పిరో యని యాలోచించుచుంటిని.

ప్రభా.— ప్రేయసీ! తెలుపుటకు వేఱొక్కఁడు కావలెనా? స్త్రీమయుని చెలికాఁ డొకఁడు లేఁడా? నిన్ను వెదకుకొనిన చ్చుటకుఁ దొలుదొల్త నతఁడు నన్నుఁ బురికొల్పి, తరువాత నుపాయము చెప్పెను, నాతనికి నాకన్నులను దోడిచ్చితిని. అప్పు డాతఁడు నన్నిక్కడకుఁ దీసికొనివచ్చెను. ఆతఁడు నా కట్టి చెలికాఁడో యెఱుఁగుదువా? నీవు సముద్రమున కావలియొడ్డున నున్న, నక్కడికైన నన్నుఁ దీసికొనిపోవలసినవాఁడే.

సరో:— ప్రభాకరా! నీకై నేను బరితపించుచున్నాను. నీ విచ్చటకు వచ్చుటకుమున్ను నేనాడినమాట లొకటి రెండైన నీవు విన్నచో, నీపై నాకెంతప్రేమకలదో, నీకుఁ దెల్లమై యుండును. నాపై నీకును నంతియే యభిమానము కలదు గదా?

ప్రభా:— కలదు. సందియమేల?

సరో:—కలుగదాయని నేనడిగినఁ గలదనియే చెప్పెదవు. నేనును నీమాటను నమ్మెదను. కాని, మోహావస్థలోఁ జెప్పఁబడిన మాటలయందు నిలుకడయుండదని తద్జ్ఞులందురు.

శా. ఊహాపోహము లించుకంతయు, దురుద్యోగంబులందుండుఁగాక్,
వ్యాహారంబులయందు, నొందకయె, సద్వృత్తి చిత్తమేజాడ సం
దేహంబుం దొలఁగించు, నాపథమునం దే వర్తిలం బోవుఁ గా
మోహావస్థల నాడువాక్యములయందున్, నిల్కడల్ గల్గునే?

మనోనాయకా! నీకునాపై నిజమైనదయయున్న, నాకు నమ్మకముకలుగునట్లుగాఁ జెప్పుము. నిన్ను నాప్రాణధనముగాఁ గొనఁదలంచి, నేనుబొందుచున్న పరితాపము వడివడిగాఁబ్రజ్వలించుచుంటచే, నది తాటియాకులమంటవలె శీఘ్రముగానే యారిపోవునని తలంపకుము. నాపై నీకుఁగూడనట్టి యనురాగమేకలదని దృఢముగాఁజెప్పి నన్ను నమ్మించుము.

ప్రభా:—హృదయేశ్వరీ! నామాట నమ్మవా? అట్లైన, నదిగో! చూచితివా? అరముగ్గిన కమలాఫలంబులపై, వెండిపూఁతపూయుచు, నమృతాకరుం డెట్లు వెలుఁగుచున్నాఁడో! ఆలోకానందకరునితోడుగ నేఁజెప్పుచున్నాను. నాకునీపై నిజముగుప్రేమము కలదు.

సరో:—వలదువలదు. ఆదోషాకరునితోడుగఁ బ్రమాణము చేయవలదు. అతఁడు నిలుకడలేనివాఁడు. రాజులకు నిలుకడయుండునా? అంతియేకాక, అతఁడు క్షయరోగపీడితుఁడై, మాసమున కొకరీతిగా, పక్షమున కొకరీతిగా, దిన

మున కొకరీతిగా, క్షణమున కొకరీతిగా నుండును. అతని తోడుగ నీవు ప్రయాణము చేసిన, నీయనురాగమాత్రనివలె నస్థిరమే యైపోవునేమో! వలదు. వలదు. అతనితోడుగఁ బ్రయాణము చేయవలదు.

ప్రభా:—అట్లయిన, మఱియెట్లు ప్రయాణము చేయుమనియెదవు?

సరో:—ప్రయాణమే చేయవలదు. ఒకవేళ ప్రయాణమే చేయవలసివచ్చిన, నీవెల్లప్పుడును భగవత్స్వరూపముగా భావించి, మననము చేయుచుండు నీమనోహరాకారము నే ప్రయాణముగాఁ గైకొనుము.

ప్రభా:—నామనంబునంగల యనురా ... ... ... ... ... ...!

సరో:—వలదు వలదు. నాకుఁ బ్రయాణమే వలదు. నాకెంత భక్తియున్నను, దోషాకరసంచరణైకయోగ్యంబగు నిట్టి నిశాసమయంబునఁ బ్రయాణము సేయుట నాకిష్టము లేదు. ఇంతయాకస్మికముగా, నింతతొందరగాఁ జేసినప్రయాణము మెఱుపుఁదీగవలె, క్షణభంగురమే యగును. సుకుమారశరీరా, నేనింక సెలవుఁ గైకొనెదను. ఇట్టివేళ నింటియొద్దనుండకున్న, నాతల్లిదండ్రు లనుమానింతురు. కావున నాకు సెలవిమ్ము. మన యనురాగకోరకము, ప్రయత్నమను ప్రభాకరుని కరస్పర్శనంబునఁ బుష్పించి, తగుసమయమున, నానందరూప ఫలంబిచ్చుఁగాత. సెలవిమ్ము పోయెద.

ప్రభా:—ఇంతీ! నీవప్పుడే యింటికిఁ బోయెదవా? నీతో నెన్నియో యంశములం జెప్పుటకు నేనిచ్చటకువచ్చియున్నానుగదా!

సరో:—అట్లయిన, నిప్పుడు చెప్పరాదా?

ప్రభా:—నేను నీకొసంగినయనురాగమునకు బ్రత్యనురాగము నీయొద్దనుండి నేను గైకొనుటయొకటి.

సరో:—అయ్యో! నీవడుకమున్నె, నీకిచ్చివేసితినే; కావలెనన్న నీకు మరల నిచ్చెదను గైకొమ్ము.

ప్రభా:—అట్లయిన, తొల్లి నీవిచ్చినది తీసికొనెదవా, యేమి?

సరో:—తీసికొనిననేమి? వడ్డితోఁగలిపి యిచ్చుటకే. నీయందు నాకుఁగల యనురాగము మహాసముద్రమువలె లోతెఱుంగరానిది. అనంతమైనది.

(తెరలో) అమ్మన్నగారూ! అమ్మన్నగారూ!

సరో.—అదిగో! యెవ్వరో పిలుచుచున్నారు. నేఁ బోవలయును. సెలవిమ్ము.

(తెరలో మరలపిలుపు).

సరో.—దాసీ! ఇదె వచ్చుచున్నాను. ప్రభాకరా! సెలవుకీసికొనెదను. దయయుంచుము. (తెరలో మరలపిలుపు). అబ్బా! యెంత కిట్లుపిలుచుచున్నది? ప్రభాకరా! ఇంచుక తాళుము. ఇప్పుడేవచ్చెదను. దాసీ! ఇదె వచ్చుచున్నాను. (పోవును.)

ప్రభా.—ఆహాహా! ఈరాత్రి నాకెంతయానందముగానున్నది! ఇదియంతయును నాకొకకలవలెఁ గన్పట్టుచున్నదే! శరీరము పరవశమగుటచే, నిది నిజమో, యబద్ధమో, నమ్ముటకు వలనుగాకున్నది.

(సరోజిని మరలఁ బ్రవేశించును).

సరో.—ప్రభాకరా! మూఁడే మూఁడుమాటలుచెప్పి సెలవు తీసికొనెదను. నిలుచుటకు వ్యవధిలేదు. నిన్ను నాపాలిటి భగవంతునిఁగానే యెన్నుచున్నాను. నీకు నాపై నిజమైన యనురాగమే కలిగినయెడల,—అనఁగా — నీవు నన్నుఁ దప్పక పెండ్లియాడనిశ్చయించుకొన్నయెడల, నాకుఁగొలదికాలములోఁ దెలియఁజేయుము. నీయొద్దకు నొక్క పరిచారికను బంపెదను. మన మీయూరునువిడచి, యెందేని సుఖించెదము. నీపదదాసినై, పరిచర్యసలిపెదను.

(తెరలో) అమ్మన్నగరూ! అమ్మన్నగారూ!

సరో:—ఇదిగో వచ్చుచున్నాను. (ప్రభాకరునితో) నన్నుఁ దీసికొని యెందైనఁజనుటకు నీ కిష్టములేనియెడల,

(తెరలో) ఇరవై సొమ్ములు పిలిసినాను. అబ్బా! యేటీ చేద స్తం. అమ్మన్నగారూ! అమ్మన్నగారూ!

సరో:—దాసీ! ఏలతొందర? ఇదె వచ్చుచున్నాను. (ప్రభాకరునితో) ఇష్టములేనియెడలఁ దెలియఁజేయుము. నూయియో, గోయియో చూచుకొందును.

ప్రభా:—వలదు వలదు. అంతమాట వలదు. నీకన్న నాకు లోకమున నేమియున్నది? మాతల్లిదండ్రుల నెట్లయిన నొడబరచి, నిన్ను నేఁ దప్పక పెండ్లియాడెదను.

సరో:—అట్లయిన సెలవిమ్ము. నీమాటపై నిలచియుండుము. పోయివచ్చెదను. (పోవును).

ప్రభా:—అయ్యయ్యో, కామినీ! నీమోము చందురుంజూడని యప్పుడు, నామనంబున నెంతచీకటి క్రమ్ముచుండును? ఆహా! కాముకులచర్య లెంతవిపరీతములు?

(సరోజిని వడివడి మరల ప్రవేశించును.)

సరో:—ఇదిగో వచ్చుచున్నాను. ప్రభాకరా! పిలచితివా?

ప్రభా:—పిలువ... ...పిలువ... పి...లు...వ...బోయితిని.

సరో:—పిలువఁబోయితివా? పిలువ నేలేదా?

(తెరలో) పిల్చేదా? అమ్మన్నగారూ!

సరో:—దాసీ! ఇదిగో వచ్చుచున్నాను. ప్రాణేశ్వరా! సెలవిమ్ము. పోయివచ్చెద. నీమాటయందు నిలుకడయుంచుము. సెలవు. (పోవును).

ప్రభా:—ఆహా! కాముకులచర్య లెంతవిపరీతములు?

ఉ. బాలుఁడు పాత్ర మవ్వలకుఁ • బారఁగ వేయుట కెట్లు కుల్కుచుం
గ్రాలునొ, కాముకుండు తన • కామినిఁజేరుట కట్లు క్రాలెడుఁన్;
బాలుఁడు పాత్రముం దనదు • పజ్జకుఁజేర్పఁగ, నెట్లు వంతచే,
సోలునొ, కాముకుండు తన • సుందరిఁబాయఁగఁ నట్లు సోలెడుఁన్.

(నిష్క్రమించును).

స్థలము 2. సరోజినియిల్లు.

(ప్రవేశము—దాసి, పద్మలత, యథోచితాసనములం గూర్చుండి).

పద్మ:—దాసీ! మనయమ్మాయియీడు మించుచున్నదికదా!

దాసి:—అమ్మా! యేటిఅనాగంతాౘ? అమ్మన్నగారి కొన్నిపంట లో నాను చమంగా సెప్తాను సూసినారా?

పద్మ:—ఏమే, యిప్పుడు పన్నెండవయేఁడు దాటినదిగదా!

దాసి:—నేదమ్మా! యెక్కడిపన్నెండు. ఉండమ్మ సెప్తాను. నాకు పద్దాలుగుపళ్లు ఉన్నప్పుడు అమ్మన్నగారు పుట్టినారు. ఇప్పుడు నాకు నాలుగుపళ్లే ఉన్నాయి. అయితే, అమ్మా! ఎన్నిపోనాయి.

పద్మ:—పది.

దాసి:—ఆఁ అదమ్మా! నాకు పంటకోపం దూడిపోయింది, అయితే, పదిపంటలుకదమ్మా, అయింది? అమ్మన్నగారికి పది పంటలేనమ్మా. అమ్మా! దివ్వాలామాస ఇంకా ఎన్నాళ్లున్నాది?

పద్మ:—పదునైదురోజులు కలదు.

దాసి:—దివ్వాలామాసకు నువ్వు నెలపురుడు తీరిపోయి, యింటికొచ్చినావుకావమ్మా? సూడవమ్మా, నువ్వింటిలోకి యెలిపొచ్చినయెనక, నాగమయ్యసయితికి కాదమ్మా, మా సేతిపిల్ల పుట్టింది? నీకు పురుడుపోసినప్పటికి నాను పొద్దులతో వున్నానుకానా? అయ్యో! నాసేతిపిల్లా యెంత ముద్దుగుండేదానవే! (ఏడ్చును).

పద్మ.—దాసీ! నీకు మతిపోయినదా యేమి? ఎప్పుడో చనిపోయినచేతిపిల్లకు ఇప్పు డేడ్చెదవేమి?

దాసి:—నేదమ్మా! యాదికొచ్చిందని, అన్నాను. బతికుంటే, అమ్మన్నగారంతది కాదా? ఆయ్యో! నారాతా, పోనీ, సూసినా అమ్మా, అమ్మన్నగారి కిప్పుడు పదిపంటలకన్న యెక్కువ సేదమ్మా?

పద్మ:—లేదే? అమ్మాయికి పన్నెండేండ్లు మొన్ననే దాటినవి.

దాసి:—అయితే, ఉండు. ఉండు. సెప్తాను. అమ్మా! అల్లప్పుడు బూమిగడగడవాడికింది సూడవా. అది యెలిపోయి యెన్నాళ్ళయిందీ?

పద్మ:—పదియేండ్లయినది.

దాసి:—ఆఁ అవునమ్మా! అప్పటికి అమ్మన్నగారు సిట్టిసిట్టియిద్దెలు సేస్తా వుండేవోరు. అమ్మా! ఆయేళ బూమి వాడికి నప్పుడు, అబ్బా! ఆబయము నాకింకా వొగ్గనేదమ్మా! ఆ యేళ-అంతే-దానికిముంగలినాడు, మా కోళ్ళగూడుపక్కని, నాను నేలయేముకోసం బోరిగపట్టుకొని తవ్వనేదా? అప్పుడు,అమ్మన్నగారు, తప్పటడుగులెట్టి, నాకాడికొచ్చి, బోరిగొట్టుకొని నిలఁబడి, నేలయేమికోరికి సిల్ అని పారీబాయి, బోరగిలపడనేదా? అప్పుడు మా మొదటోడు, అమ్మన్నగారూ! అమ్మన్నగారూ! ఇప్పుడు బోరగిలపడ్డావు, ఇక కసిన్నాళ్లుపోతే, యెలికిలపడతావా, అన్నాడు కాదమ్మా' అంతే ఆపాట్కా అమ్మన్నగారు ఏడుపు మానీసి 'ఏఁ' అన్నారుకారమ్మా? నాకు బాగా యాదికుందమ్మా, అప్పుడు సూడవా, అమ్మన్నగారికి నెత్తిమీద ఇంతబొడిపికట్టే, మా మొదటోడు చున్నం పెట్టనేదమ్మా?

(సరోజిని ప్రవేశించుచున్నది).

సరో.—దాసీ! నీపురాణమున కంతముండదా యేమి?

దాసి.—అదిగో! అమ్మన్నగారూ ఒచ్చినారు. ఫరాండాల కేటీ సేదమ్మా! నాను యెన్నేళ్ళు బదికినా, మరిసిపోనమ్మా. ఆకంచెమ్మతల్లి నిన్ను మరిసిపోయి, మీయమ్మకడుపు సల్లగా, నారు పురుసోసినసోట్లన్నిటికన్నా, నీవురిటికి పప్పు బూరెలు కడుపునిండా తిన్నానమ్మా, నీపెళ్ళికూడా బేగైతే, నాపిల్లలు నేను బూరెలు, గారెలు తిందామని, నా గోలంతాను, మరేటమ్మా.

పద్మ.—అదిగో! ఆపెండ్లినిగూర్చి మాటలాడుటకే, నేనిక్కడకు అమ్మాయిని బిలిచితిని. అమ్మాయీ! మనవేగినాటివారలలో నీకిన్నఁజిన్నపిల్ల లప్పుడే పిల్లలతల్లులై పోయినారు. నీకును బదునేడేండ్లు దాటినవి. ఇంకఁ బెండ్లిసేయకున్న మనదురదృష్టవశమున నీవు పెద్దపిల్లవైనచో, మనమందరము సముద్రములోఁ బడిపోవలసినదే. మీనాయనఁగారిచేఁ దీసికొనిరాఁబడిన సంబంధమునుగూర్చి నీవింక నిశ్చితాభిప్రాయము నీయవు. దానికిఁ గారణమేమి?

సరో.—కారణము నీకుఁ దెలియదా? అమ్మా! మనలో నాఁడువాండ్రకు సహజముగుమూర్ఖత, చదువునేర్చినదానవగుటచే, నీకు లేదని నేననుకొనుచున్నాను. నీవుగూడ నింక పట్టుపట్టెదవా? కాటికిఁ గాళ్ళుచాపుకొనిన యీముసలివానిని నన్నెట్లు పెండ్లియాడుమనియెదవు? నీకు దయయున్న, నన్నా ... ... ... ... ... ... ... ... ... ...

పద్మ:—ఆపరిభాకరునిఁగూర్చియేనా, చెప్పఁబోవుచున్నావు?

సరో:—ఆసంబంధమును జేసికొనుటకు నీ కేమియాటంకము?

పద్మ:—నా కేమియు నభ్యంతరము లేదు. మనవారిలో నంతటి చదువుకొన్న వాఁడును, అంతటి యందగాడు నీచుట్టుపక్కలలో లేఁడు. వానితండ్రియును, రాజుగారియొద్ద దివా౯గా నుండుటచే, జరుగుబాటునకు లోపము లేదు. అయినను, మీనాయనగారి నెఱుఁగుదువుకదా? ఆయనకు ధనాశ మెండు. ఆముసలివాఁడు ... ... ... ... ...

సరో.—అమ్మా! ఆసోదెయంతయు నాతోఁ జెప్పుటయేల? తల్లివిగావున, నీతోఁ జెప్పుచున్నాను. నీకు నాపై వాత్సల్యమే కలిగినయెడల, నాముద్దు చెల్లింపుము.

(తెరలో) కావున, యిప్పుడు సగము చెల్లించితివి. మిగిలినసగ మెప్పుడు చెల్లింతువు?

పద్మ.—అమ్మాయీ! నాకు సాధ్యమైనంత ప్రయత్నము చేసెదను. ఓపిక చేయుము.

(తెరలో మఱియొక గొంతుకతో) సాధ్యమైనంత ప్రయత్నం చేస్తాను. ఓపిక చేయండి. పదిహేనురోజుల్లో మిగిలింది పూర్తిగా చెల్లించేస్తాను.

సరో.—(తనలో) నాకొంపముంచుటకే, వీ రీచేరములన్నియు నాడుచున్నారు.

(ప్రకాశము) అమ్మా! నీవు నాకుఁ గన్నతల్లివి. ఆఁడువాండ్రకష్టసుఖము లాఁడువాండ్రకే గాని, మగవారి కెట్లు తెలియఁగలవు? నీపాదములే నాకు దిక్కు. (కాళ్ళుపట్టుకొనును).

(తెరలో, రెండవగొంతుకతో) మామగారూ! మీరే నాకుదిక్కు.

(తెరలో మొదటిగొంతుకతో) నీకష్టసుఖములు నాకు మాత్రము తెలియవా? మీయత్తగారి నొకసారి చూచిపోవుదువుగాని, యిటురమ్ము.

వృద్ధ.—అమ్మాయీ! మీనాయనగారు క్రొత్తపెండ్లికొడుకును దీసికొనివచ్చుచున్నట్లున్నది. నీ విక్కడనుండకుము. పొమ్ము దాసీ! నీవుకూడఁ బొమ్ము. (దాసియును, సరోజినియును పోవుదురు).

వృద్ధ.—కటకటా! అమ్మాయికి నెంతకష్టమువచ్చినది?

సీ. తండ్రి యింతటి పట్టుదల వహించినయప్పు
డన్యులేరైన మాన్పఁగలరె?
తల్లినా మాట తలఁపఁ డింతైనను,
ధనమె యెక్కుడు గాఁగఁ దలఁచుఁగాని;
అరువదేండ్లు దాటినట్టియావృద్ధుని,ఁ
గూడి యెట్లుసుఖించు కూతురింక;
నల్లనీసపురాయి నాఁ గట్టియుఁగదా,
మగవారిచిత్త మేపగిదినైనఁ

గీ. కటకటా! లేకలేకయె కన్నయట్టి
యాఁడుబిడ్డసుఖంబు నింతైనఁ జూడఁ
డేమిసేయుదుఁ దప్పెత్తి మెటుమరల్తు;
నీశ్వరా! తోడు నాకింక నీవెకావె!

[సాగరశాస్త్రియును, వామనశాస్త్రియును ప్రవేశింతురు].

సాగ.—అదిగో! మీయత్త, నమస్కారము చేయుఁడు.

వామ.—అత్తా! నమస్కారము (వంగి, బలవంతముగ లేచును).

పద్మ.—తాతగారూ! మీరు నాకు నమస్కారము చేయుట ధర్మమా? పెద్దలుగదా! మీమనుమరాలితో సమానురాలనగు నాకును నమస్కారము చేయుటయేనా?

వామ.—అత్తా! మీరే నన్ను తాతా అంటే, ఇంకా సైవాళ్ళ అనరూ? ఏమిటో, పైత్యశరీరము చేత, వొళ్ళు కొంచెం వొంగింది. జుత్తు కొంచెంపండింది. మొన్న నేకదమ్మా, యాభై దాటాయి? మానాయనగారు ఎనభై యేళ్లు జీవించేరు. మాతాతగారు "శతమానంభవతి" అని, నూరేళ్లు సమంగా జీవించేరు. నాకూ మాతాతగారిపేరే పెట్టేరు అయితే, యెందుకలా దగ్గుతావు, అని అడుగుతారు. చిన్నప్పటినుంచీ కొంచెం వుబ్బసవుంటేనూ, అది ఈసీత కాలం రావడంతోనే, అలాఅవుపిస్తుంది. మరేమీ లేదు. అందుకే, ఎవరో వైద్యుడు చెబితే చుట్టకూడా తాగడం అభ్యాసంచేసేను. ఇగ పోవచ్చును.

పద్మ.—(తనలో) ఇంక పోవునవిప్రాణములే. (ప్రకాశముగా) అయ్యో! మీరువచ్చినపని యైనదా?

వాను.—అవును. అత్తా! నేనుంటే నీకు చిరాకుకాబోలు?

సాగ.—శాస్త్రిగారూ! దానితో మీకేమి?

వామ.—అత్తా! మీదయా! నాభాగ్యం! సెలవు.

పద్మ.—చిత్తము దయచేయుఁడు.

వామ.—మామఁగారూ! సెలవు. (నిష్క్రమించును).

సాగ.——నే నిప్పుడు చేసినప్రయత్నమునకు నీవేమియును జవాబుచెప్పవేమి?

పక్ష.——ప్రాణేశ్వరా! శాంతించి విన్నచో, నాయుద్దేశమును జెప్పెదను.

సాగ.——నాకుఁ గొంచెము ప్రథమకోపము. నీకుఁ దెలియును గదా?

పక్ష.——పదునైదేండ్లనుండి మీతో సహవాసముచేయుచున్న నాకు మీస్వభావము తెలియదా? మీది వట్టి పంచదారవంటి మనస్సు.

సాగ.——నీయిచ్ఛకమునకేమిలే. నాప్రశ్న కుత్తరము చెప్పుము.

పక్ష.——ఉత్తరమునకేమున్నది? మీసెలవుదాటినదానను గదా!

సాగ.——కావుననే, నీతో వేఱుగ నాలోచింపలేదు. అయినా, నీయుద్దేశ మేమి?

పక్ష.——ఉద్దేశమున కేమియున్నది? ధనమువచ్చునన్న, నాకు మాత్ర మాశ లేదా? కాని, ఈసంబంధమువలన, అమ్మాయికి సుఖభంగము కలుగునేమో యని, భయముగు చున్నది.

సాగ.——నీకేమిపిచ్చిపట్టినదా? అమ్మాయిసుఖమునకు భంగము చేయవలసినదని నేనెన్నఁడైనఁ గోరితినా? ఈముసలివాని యొద్ద పదివేలరూపాలు లున్నవి. భూమియును, పుట్టియును, వడ్డీవ్యాపారము నున్నది. పాత్రసామా నున్నది, ఇతని కిప్పు డరువదియేండ్లు దాటినవి. మిక్కిలి బ్రదికిన

నీకు నైదేండ్లకన్న నెక్కువ బ్రదుకఁడు. వారసులుకూడ నెవ్వరును లేరు. అమ్మాయి నాతనికిఁ గట్టిపెట్టినచో, ఆ రవంత ప్రాణము గుటుక్కుమనినచో, ఆధనమంతయు మనకే వచ్చిచేరును. అమ్మాయి స్వేచ్ఛను నేనెప్పుడును భంగముచేయను. మంగళసూత్రముతప్ప, అన్నినగలును బెట్టుకొనవచ్చును. ఇచ్ఛకువచ్చినట్లు తినవచ్చును.

పద్మ.—మీామనస్సునుబట్టి మీా రాలోచించుచున్నారు కాని, ఆజన్మాంతము సుఖింపవలసిన యమ్మాయి మనస్సునుబట్టి మీా రాలోచింపలేదు. పదునారువందలరూపాయిలనగలు పెట్టుభర్తకన్న, పదునారేండ్లభర్తయే యాఁడుపిల్లలకు నెక్కువయిష్టము దానియుద్దేశము మీారు తెలిసికొనవలెను.

సాగ.—ముక్కుపచ్చ లారనిపిల్ల. దానియుద్దేశముతో మన కేల? నీయుద్దేశము నిశ్చయముగాఁ జెప్పుము.

పద్మ.—నాయుద్దేశముకూడ ... ... ... ... ... ... ... .....

సాగ.—ఓహో! కూడలుకూడ కూడఁబెట్టుచున్నావు. నీయుద్దేశముతోఁ గూడ నాకుఁ బనిలేదు. నామాట నేనుతప్పను. అప్పుడే ఆరువందలుపుచ్చుకొంటిని. పదునైదురోజులలో మిగిలిన యారువందలును వచ్చును. "స్త్రీబుద్ధిః ప్రళయాంతికా." అన్నవాఁడు బుద్ధిహీనుఁడుకాఁడు. ఆఁ; అరుణాచలశాస్త్రిగారికి జబ్బుగానున్నది. వారిని రెండుమూఁడురోజులైనది చూడలేదు. ఏదో, పెద్దయుద్యోగస్థుఁడుకదా! ఒకసారిచూచివచ్చిన నెందుకైన మంచిది. (నిష్క్రమించును).

పష్ఠ.—ఓధనమా!

శా. సౌశీల్యంబున నొప్పువారయిన, నీ • సామీప్యముం బొందు, దు
ష్కౌశల్యంబునఁ జూపుచున్ వృజినసం•ఘాతమ్ములం జేయఁగా,
నాశాపాశములోడ మానవుల స•త్యంతంబు బంధింతువా;
వైశాల్యంబగు తావకీనమహిమన్ • వర్ణింపఁగా శక్యమే!

(నిష్క్రమించును).

[స్థలము 3. అరుణాచలశాస్త్రిగారి యిల్లు].

(ప్రవేశము) (అరుణాచలశాస్త్రి) మంచముపైఁ బండుకొని యుండఁగా, భార్య సంధ్యాదేవి పాదము లొత్తుచుండును. కుమారుఁడు ప్రభాకరుఁడు ప్రక్కఁగూర్చుండును).

ప్రభా.—నాయనగారూ! ఇప్పుడు త్రాగినమందువలన నేమైన గుణము కనిపించుచున్నదా?

అరు.—కొంచెము సుఖముగా నున్నట్లే యున్నది. తలనొప్పి తగ్గుచున్నది. జ్వరముకూడ తగ్గుచున్నట్లు తోచుచున్నది.

ప్రభా.—(నాడిచూచి) జ్వరతీవ్రత తగ్గుచున్నది. సాయంతనములోపున, నుష్ణము విడువవచ్చును.

అరు.—ఇరువదిదినములనుండియు నాకొఱ కెంతయో శ్రమపడుచున్నావు. మందులకని మాత్రికులకని, వేళ్ళకని, మూలికలకని, వైద్యులకని పాప మెంతయో తిరుగుచున్నావు. నీఋణము తీర్చుకొనలేను.

ప్రభా.—తా మట్లుసెలవిచ్చుట ధర్మమా? పితౄణవిముక్తికైయే గదా, నేను గోరుచున్నాను. ఇంతకును నేనుపడుశ్రమ మేమి? అమ్మగారియవస్థచూడ, నాకు జాలియగుచున్నది

పాప మూమెత్తిన్న గాఁ దిండియైన తినక, నిద్రయైనఁ బోక, యెట్లు భవజ్జ్వరవిముక్తికై పరితపించుచున్నది!

సంధ్యా.—నాయనా! నేనుపడుశ్రమ మేమియులేదు. నిద్రాహారములు వర్జించి, నీవు పడుపాట్లుచూడ, నాకు నెంతో విచారముగానున్నది. ఏమిచేయను? మీనాయనగారికి, ముందునకును, వెనుకకును, నీవొక్కఁడవేకదా?

ప్రభా.—నాయనగారూ! ఏలోకో, తాము కొలదిదినములనుండియు, జ్వరతీవ్రతకన్న నెక్కుడగుమనోవేదనచే, బాధనొందుచున్నట్లున్నది. అదిమనరాజుగారి పనింగూర్చియేనా?

అరు.—అవును. నాకు నదియే యెంతోసంతాపకరముగానున్నది.

ప్రభా.—దీనికే యింతవిచారింపవలెనా? "శరీరమాద్యం ఖలుధర్మసాధన"మ్మని, తామేకదా నాకుబోధింపుచుండెడివారు జ్వరపీడితులగుటచేఁ దాము శ్రీకాకుళమునకుఁ బోలేకుంటిరిగాని, కోరి మానివేయలేదుగదా?

అరు:—నాయనా! నీవు వట్టి వెఱ్ఱివాఁడవుసుమా! నీవు చెప్పిన లోకోక్తి యితరస్థలములలో సూక్తియేగాని, రాజభక్తియందుమాత్రము కాదుసుమా! "ధర్మంచర"యని వేదము శాసించుచున్నదికావున, తమ యర్థమును బ్రాణమును మనకేయర్పణచేసి మనలనే నమ్ముకొనియున్న మనప్రభువులపని చక్కఁజేయుటయే మనకుఁ బ్రథమకర్తవ్యము. తనపనుల నిట్లశ్రద్ధచేయుటచే, రాజుగారి కెంతకోపముగా నున్నదో!

(తెరలో) బాబూ! బాబూ!

అదిగో! రాజసేవకుఁ డెవ్వఁడో వచ్చి తలుపుతట్టుచు న్నాఁడు. పోయి తలుపుతీసిరమ్ము.

ప్రభా.—చిత్తము. పోవును.

అరు.—(తనలో) ఆహా! నే నెంతటియదృష్టవంతుఁడను? నా కుమారునకుఁ బితృభక్తియున్న, వెన్నతోఁబెట్టినదికదా నే నిట్టి కుమారునిఁ గనినందునకు విఱ్ఱవీగవలసినదే.

[ప్రభాకరుఁడు సేవకునితోఁ బ్రవేశించును].

౿ .—ఏమి? రాజుగారు మరల నుత్తరముఁబంపిరా?

ప్రభా.—చిత్తము. నేను జదువవచ్చునా?

అరు:—చదువుము.

ప్రభా.—(చదువును) స్వస్తి శ్రీజలంధరరాజ్య నగర్వ్యాలకు అరుణాచలశాస్త్రిగారికి విక్రమదేవుగారు నమస్కారము లుచేసి వ్రాసినది:—

శ్రీకాకుళమునకుఁ బోయి నవాబుగారిదర్శనము చేసి, మన పేష్కషువిషయమైన తగాయిదా పరిష్కరించుకొని రావలసినదని మీకు నిదివరకు రెండుపర్యాయములు సెలవిచ్చి యున్నాము. మీరు జాలముచేయుట బాగుగలేదు. ఈయుత్తరము చూచినవెంటనే మీరుపోవకున్న, మీపైని మాకుఁ గోపము వచ్చును. ఆపైని మీయిష్టము.

విక్రమదేవవర్మవ్రాలు.

అరు.—నాయనా! చూచితివా? నేఁజెప్పలేదా? అయ్యయ్యో! నేనెట్లుపోవుదును? కానిమ్ము. రాజద్రోహియని పేరొంది సుఖించుటకన్న, రాజభక్తుఁడని పేరొంది చనిపోవుటయే నాకు నిష్టము. ఎట్లయినఁ గ్రమపడి, పోయెద. ప్రయాణ సన్నాహము చేయుము. నేఁటిరాత్రియేబయలుదేరెదను.

(లేచి కూర్చుండి, మొగముతిరుగ, మంచముపైఁ బడి పోవును. ప్రభాకరుఁడును, తల్లియును, విసర కొంచెము సేపటికిఁ దెలివివచ్చును).

అరు.—నాయనా! తప్పకపోయెదను. నా కభ్యంతరము చెప్ప వద్దు. ఎంతమాత్రి మభ్యంతరము చెప్పవద్దు. నీవుపోయి, మనబండివానితోఁ బండిసిద్ధముచేయుమని చెప్పుము.

ప్రభా.—చిత్తము. అట్లనే చేసెదను. కాని నాకొకమనవికలదు.

అరు.—నాప్రయాణమున కభ్యంతరము చెప్పెదవేమో! వలదు.

ప్రభా.—లేదు. అభ్యంతరము చెప్పను.

అరు.—అట్లయిన చెప్పుము.

ప్రభా.—తమప్రయాణము మాకు సంతోషదాయకమే-కాని

అరు.—అదిగో! కానులెందున కుపయోగించుచున్నావు?

ప్రభా.—లేదు. శాంతింపుఁడు. తమకటాక్షమువలన నేను కొంచెమో గొప్పయో చదువుకొనినానుగదా?

అరు.—అవును.

ధనధాన్యము లొసంగి ♦ మనుచు మముం బెంచినట్టి
జననాథుకోపంబు ♦ సైచు టెట్లు!
గీ. చేత నైనట్టి పనియేనిఁ ♦ జేయరాని
యాఁడుదానను నైతి ♦ నక్కటకటా!
యేమి సేయుదు, నాకింక ♦ నెవరు దిక్కు?
దీనరక్షక, నమఁజూడు ♦ దేవదేవ!

ప్రభా.—అమ్మా! మీ రేల యిట్లు విలపించెదరు? మీ బిడ్డను నన్నాశీర్వదించి పంపినచో, మీ యాశీర్వచనప్రభావమున నేను గార్యము మూఁడునిమిసములలోఁ జక్కఁజేసికొని వచ్చెదను.

అరు:—నాయనా! నీసామర్థ్యము నే నెఱుంగనిదికాదు. నీవు పోయినఁ గార్యము చక్కఁబడదనియు, నాయుద్దేశము కాదు. లేక లేక కన్నసంతాన మగుటచే, నిన్నొక్కనిముసమైనఁ బాసియుంటకు మాకు నిష్టములేదు, అందుననే నే నట్లనుచుంటిని.

ప్రభా.—నాయనగారూ! తమ కట్టిచింతవలదు. నేను కార్యము చక్కఁజేసికొని, యతిశీఘ్రకాలములో వచ్చెదను.

అరు.—అట్లయినఁ గలమును గాగితమును దెమ్ము. రాజుగారికి జవాబువ్రాయుదము.

ప్రభా.—జవా బవసరములేదు. రాజుగారియొద్దకు నేనే స్వయముగాఁబోయి, వారిసెలవు గైకొనివచ్చెద.

అరు.—అట్లయినఁ బొమ్ము. 'శుభస్యశీఘ్రమ్' శీఘ్రముగాఁ బోయిరమ్ము.

ప్రభా.—నాయనగారూ! సెలవు. నమస్కారము.

అరు.—రాజద్వారేదిస్వైజయమస్తు.

సంధ్యా.—నాయనా! రాజులమన్నన లందిరమ్ము.

(ప్రభాకరుఁడు రాజసేవకునితో నిష్క్రమించును).

సంధ్యా.—(తనలో) నా ప్రబదు కిటుఁజూచిన నూయియు, నటు జూచిన గోయియు, నైయున్నది.

ఉ. ఎక్కడవచ్చె నాపతికి ♦ నీజ్వగ మిక్కటినాళ్ళుండి, యిం
కెక్కడవచ్చె నీపయాన ♦ మీపతిసుకార్యపు దుర్మిషమ్మునట
మిక్కిలిచిక్కియున్న విభు♦నిన్ వడిఁ బొమ్మని చెప్ప నేర్తునా,
చక్కని చిన్నిబిడ్డని వి♦సం జనుమంచు వచింప నేర్తునా!

(తెర జారును).

## స్థలము 4. బాట.

[ప్రవేశము, దాసి, వామనశాస్త్రియును, జెట్టియొక పక్కనుండి].

దాసి.—దండాలు బాబు! దండాలు. దండాలు.

వామ.—కలగాలి. కలగాలి.

దాసి.—బాబూ! ఎక్కడా దయనేదు. మాకాసి కసింత నూడడమే మానీసినావు.

వామ.—నీవేప్పుడుకావలిస్తే అప్పుడు చూడవచ్చును గాని, దాసీ! నా కోపుపకారం చేస్తావా నీమేలు మరచిపోను.

దాసి.—సెప్పండిబాబు, సేతనైతే ఇంతకన్నానా:

వామ.—మరేమీ లేదుగాని, మీరింతసేపుంటూన్ని నాకు పె
ళ్ళిమాటలాడడం నీకు తెలుసునుగదూ?

దాసి.—(తనలో) ఇక్కడ పాసికెయ్యాలి. (ప్రకాశముగా న
వ్వుచు) శా! తెలసేను బాబూ! ఒక్కబాబూ, తెలిస్తేనా!
యింతకన్నా యేటిబాబూ! నిన్ను పెళ్ళాడితే, అమ్మన్నగారు
మూరుగపడతారు బాబూ! నగ, నట్ర సేయిస్తారు. ముస్తు
ముచ్చట జరిగిస్తారు. నీ కేటినోటు బాబూ! దనాలకుప్ప
ప. గానాలతిప్ప.

వామ.—కోక్కుకోలమంటే గోటలోక బుర్ర నీకెందుకే? నా
మాట వింటావా, వినవా?

దాసి.—వానాలికె పెట్టడబాబూ! మాకేమీ నేదు. సెప్పు సెప్పు.

వామ.—విన్నావా! పన్నెండువందలు నీళ్ళబొడ్డుమీద పోస్తు
న్నాను. ఆపిల్ల నన్నుచూస్తే మిటికలువిరుస్తుంటుంది.
దాసితో నువ్వు వోమాటుచెప్పి, నామీద అభిమానం పు
ట్టిస్తూ, నీవున్నాం వుంటుంది. ఈమాటు మంచికోక కొని
యుస్తాను

దాసి.—బాబూ! నా మొగుడు సచ్చిపోయినకాడినుంచీ నిన్నే
కదా, నా కింతగంజి పోస్తున్నావు. ఏటో! ఆపిల్లాయీళ్ళూ
మెయ్యకుంటే మన కేటికావాల. ఆపద్దమ్మగారు, పా
పం, ఎందుకొచ్చినమాట. యెనకే సెప్పుకోవాలి. మా
మంచితల్లి. కడుపునిండా అన్న మెడతాది. అయినా, నా
పిల్లలూ, నేను, నీదర్మాన్నే కదా, బతుకుతున్నాం. మొద
టోడు చేసిలోపం కనపడకుండా సేస్తున్నావు, నీమేలు మ
రచిపోతానా?

వామ.—ఇప్పు డావూసంతా యెందుకు? నేను చెప్పినట్టు చే
స్తావా? చెయ్యవా?

దాసి.—నిబ్బరగ సేస్తాను బాబూ! అమ్మన్నగారిని పిలిసి, "అమ్మ
న్నగారూ! అమ్మన్నగారూ! అళ్లుళ్లుగారు మాదొడ్డో
ట. ఆరికి నామీద మాయిష్టం.

వామ.—ఛీ! అవూసుమాత్రం చెప్పకుమా.

దాసి.—పోసి! సెప్పను నే! అంతమంచిమొగుడు నీకెనాగు
దొరుకుతాడని సెప్తాను. చరా.

వామ.—ఆఁ! అలా చెప్పి దానిమనస్సు తిప్పాలి.

దాసి.—తప్పక సేస్తాను బాబూ! నీతోడు. నామాటనమ్ము.

వామ.—ఏదో చూస్తానుగదా. ఆపిల్ల, నన్ను పెళ్ళాడితే, మళ్లీ
ఎలాంటికోక కొంటానను కొన్నావు!

దాసి.—నువ్విచ్చినకోకలుకూడా అమ్మన్నగారికి చూపుతాను.

వామ.—ఛీ! వద్దు. అవూసే యెత్తకుమా. ఎత్తితే కార్యం పాడ
వుతుంది.

దాసి.—పోనీ! సేమనే. మంచిమాట లాడుతాను నే. నీకేం బ
య్యం నేను. అమ్మన్నగారిని పెళ్ళాడితే, నన్ను మరిచి
పోకుమా?

వామ.—ఎప్పటికీ మరిచిపోను.

(తెరలో) దాసీ! దాసీ.

దాసి.—అదిగో! అమ్మన్నగారు పిలుస్తున్నారు. పోతాను వ
యుంచు.

వామ.—పో. మరిచిపోకుమా. (నిష్క్రమింతురు).

స్థలము 5. ఆలయములోని పూఁదోట.

[సరోజినీప్రభాకరులు గుమ్మిపైఁ గూర్చుండురు].

ప్రభా.—కాంతా! ఇది యెంతమాత్రము నా కిష్టము లేదు సుమా!

సరో.—అట్లు త్రోసిపేయుట ధర్మమా? నీపదదాసినైన నన్ను నీవే యిట్లు త్రోసిపేసిన, నింక నన్నాదార్చువారెవ్వరు?

ప్రభా.—ప్రియసీ! నేను పోవునది తొందరపనికైనని చెప్పలే దా. శీఘ్రముగా వచ్చి, నిన్నుఁ గలసికొనెదను.

సరో.—అట్లయిన, నెన్నిదినములలో వచ్చెదవు?

ప్రభా.—పదిదినములకన్న మించదు.

సరో.—ఆముసలివానికి నన్నుఁ గట్టిపెట్టుటకునిశ్చయించిన ముహూర్తము నేటికి సమముగాఁ బదునైదుదినము లున్నది. పదిరోజులలో నింక నీవు రాకున్న, సీనరోజిని యింక నీటిలో మునిఁగిపోవును. ఆపైని, నీదయ.

ప్రభా.—కటకటా! అంతమాట వలదు. నీవు నన్నెంతయభిమానముతోఁ బంపెదవో, నాపని యంత చక్కఁబడును. తెల్లవారవచ్చుచున్నది. నేఁ బోవలయును. పోయివచ్చెద.

సరో.—తొందరపనియనుటచే, మాటాడలేకున్నాను. నేనుఁ గూడ నీవెంట వచ్చిన—పోనిమ్ము. ఇప్పుడువద్దులే. పది దినములలోఁ దిరిగివత్తువుకదా.

ప్రభా.—తప్పకవచ్చెదను.

సరో.—పనిపాడుచేసికొని, నాయొద్ద నీవు నిలుచుట నాకు మాత్ర మిష్టమా? పొమ్ము. ఆయుదయించునది సూర్యుడే. ఆకూసినది భరద్వాజమేకాని, యీభరద్వాజ మెట్లు స్వరభంగముగా బాడుచున్నదో చూడుము? లయయును తాళమును గొంచెమైన నక్కఱ చేయకున్నది. భరద్వాజమునకు గాలవిభజనము బాగుగా దెలియునని కొందఱు చెప్పుదురు. కాని, దీనికిమాత్రము మనలను విభజనసేయుటయే తెలియునుగాని, కాలమును విభజనసేయుట తెలియదు కాబోలు?

ప్రభా.—అదిగో! చూడుము. తూర్పున వెలుగెట్లువృద్ధియగుచున్నదో!

సరో.—తూర్పున వెలుతురెట్లువృద్ధియగుచున్నదో, నాచిత్తమున చీకటి యట్లు పెరుగుచున్నది.

(తెరలో) అన్నగారూ! అన్నగారూ! మీకోసం వెతుకుతున్నారు అమ్మగారు.

ప్రభా.—సరోజనీ! నా కాలస్య మగుచున్నది. సెలవిమ్ము. పోయెద.

సరో.—తిరుగ నెప్పుడువచ్చెదవు?

ప్రభా.—పదిదినములలో వచ్చెదనని చెప్పలేదా?

సరో.—చెప్పితివా? అవును. మఱచితిని. అట్లయిన, గంటలో నెన్నిరోజుల కొకొక్కసారి కబురంపెదవు?

ప్రభా.—గంటలోనరోజులేమి?

సరో.—ఏమియులేదు. పదిరోజులలో నీవు రాకున్న, నాబ్రదు
కిట్లే విపరీతమగునని నీకుఁ దెలియఁజేయుచున్నాను.

ప్రభా.—అట్లయినఁ బోయివచ్చెద.

సరో.—చిత్తము (ప్రభాకరుఁడు నిష్క్రమించును).

మ. అతిరాగంబున లోకబాంధవుఁడు పూర్వాద్రిన్ వడిం దోఁప, నా
యతమోదంబున జోడుఁగూడ, విరహోద్యత్ప్రీతిఁ బోనాడఁ జా
లితి వీవింకను నాకు నిట్టిసుగముల్ సేకూరు టేనాఁటికో,
పతిహస్తంబునుబట్టు టెన్నటికో, తెల్పన్ రాదె, చకోరింగనా!

# ద్వితీయాంకము.



స్థలము 1. నాగావళియొడ్డున నున్న కుముదినిమేడ,

ప్రవేశము. కుముదిని.

(స్వగతము) అక్కటా, ఆరుగంటలుకొట్టుటతోనే, యాపెను బంపితిని; ఒక్కయరగంటలోనే తిరిగి వత్తునని చెప్పి, యాపె పోయెను. ఇంతప్రొద్దెక్కినను, మరలిరాకుంట కేమి కారణము? అతఁడు కనుపడకపోయెనా? కనుపడకపోవు టెట్లు? ఇప్పుడేకదా యీదారిని బోవుచుండెను. ఆపె కోరియే యాలస్యము చేయుచున్నదేమో? అదిగాదు. ఆపె సహజముగ మందగమన. అందును ముసలిది. అయ్యయ్యో, కామినీవార్తాహరులు సూర్యకిరణవేగమునకన్నఁ బదిరెట్లెక్కువ యగుమనోవేగముతోఁ బోయిరావలదా; అదిగో, తొమ్మిదిగంటలు కొట్టుచున్నాఁడు. ఆరుగంటలు-తొమ్మిదిగంటలు-మూఁడుగంటలు-నూటయెనుబది నిముసములు- పదివేలయెనిమిదినూర్లలిప్తలు. అబ్బా యెన్నియుగములు? ఒకమహాకల్పమే యయ్యెను. ఇంకను రాలేదు. ఆపె నావలెనే వయస్కురాలై, మోహావేశమున నున్నయెడల, బంతివలెఁ దుమ్ముచుఁ బోయివచ్చియుండును. కాని యది ముసలిది. ఈముసలివాండ్రందఱును, సీసమువలె, లొంగనివారై, మందులై, భారములై, యెల్లప్పుడు తెల్లఁబోయి చూచువారైయే యుందురు,

( వృద్ధపరిచారిక ప్రవేశించును )

అన్నా, యింతసేపునకు వచ్చినది! పరిచారికా, వచ్చితివా? పోయితివా?

పరి:—అమ్మా, మీరు ప్రశ్న తప్పడుగుచున్నారు. పోయితివా, వచ్చితివా, అనిగదా యడుగవలెను?

కుము:-అయ్యో! నామాటపూర్తిగావినని దే,తప్పులుపట్టెదవేమి?

పరి.—అట్లయినఁ జెప్పుడు.

కుము.—పోయితివా? కనుపడెనా? పోల్చితివా? కలసితివా? ఏయూరు? ఎప్పుడువచ్చెను? ఏలవచ్చెను? బసయెక్కడ? ఎన్నిదినములుండును? అన్నిటికి నొక్కమాటతో జవాబు చెప్పవలెను.

పరి.—అమ్మా! (చూచుచు నూరకుండును).

కుము.—మాటాడక, తెల్లఁబోయి చూచెదవేమి? నీవు చెప్పఁబోవుసంశయములు చేదేయయిన, తీయని నీపలుకుఁదేనియతోఁ గలిపి యిమ్ము. మధురములే యయిన, మోము ముడుచుకొనుటయును వేపాకుపసరును గలిపి, యేల చేదుగాఁజేసెదవు.

పరి.—అమ్మా! నే నలసిపోయితిని. కొంచెముతాళుము.అబ్బా! నాయెముకలు గుండయైపోయినవి. ఎంతపరు గెత్తవలసి వచ్చెను.

కుము.—ఓసీ! నీకుఁ గావలసినయెడల, తరువాత, నాయెముకల నెరువు నిచ్చెదనులే. ఇప్పుడు, పోయినపని యేమియయ్యెనో చెప్పుము.

పరి.—అమ్మా! తొందరయేల? కొంచెము ఓపిక చెయ్యలేరా? నా యూపిరి యాడకున్నది. ఓపిక చేయుఁడు.

కుము.—ఊపిరి యాడకున్నదని నాతోఁ జెప్పుటకు నూపిరి యాడుచున్నదిగాని, నాప్రశ్నమున కొక్కయుత్తరము చెప్పుటకేనా, యూపిరియాడలేదు? నీవు చెప్పఁబోవు నంశముకన్న, చెప్పకుంటకు నీవు చూపుకారణమే యధికముగానున్నది. ఐనన్ము. ఒక్కటిచెప్పుము. నీవుపోయిన పని, కాయయ్యెనదా, పండైనదా? ఒక్కమాటచెప్పిన గొంచెము ఓపిక చేసెదను.

పరి.—అమ్మా! కోరికోరి యేలయట్టివానిని గోరుచున్నారు? వానిమొగ మందమైనదే. కన్ను, ముక్కు, కాలు, చేయి, నోరు, గోరు అన్నియును దీరుగానేయున్నవి. కాని, అబ్బా! ఆడుదానిఁజూచిన నాతని కెంతసిగ్గమ్మా! నాతో మాటాడుచున్నంతసేపును మోము దించుకొనియేయుండెను. అయినను, వట్టి మేకవంటివాఁడు. అతిసాధువు. అమ్మా! భోజనము చేసినారా?

కుము.—పరిచారికా! అతనిఁజూచినతోడనే నేఁ బోల్చుకొనని యంశము లేవియు నీవునాతోఁ జెప్పలేదు. నీవు పోయిన పని యేమైనదో చెప్పుము. వేగము చెప్పుము.

పరి.—అబ్బా! తలనొప్పి. ఎంత యెగురుచున్నది. ఇరువది ముక్కలై పోవునట్లున్నది. అమ్మా! ఈవీధినుండి యావీధికి, నావీధినుండి యీవీధికి, నన్నుఁ ద్రిప్పి త్రిప్పి చంపినాఁడు. అబ్బా! అతఁ డెంత వేగముగా నడచును?

కుము.—అతఁడు నిన్నలయికఁ బెట్టినందునకు నే నెంతయు విచారించుచున్నాను. నీ వెంతయో మంచిదానవని నమ్మియున్నాను. పరిచారికా! వేగము చెప్పవా? చెప్పక నన్నేలయల్లరిచేసెదవు?

పరి.—అమ్మా! అతఁడు మోము దించుకొనియున్నను, నాతో నెంతయో మర్యాదగ, దయగ—చతుర యేఁడీ?—

కుము.—ఏమే యట్లుచెప్పుచున్నావు? నీమాట యొంతవంకరగా నున్నది? మర్యాదగ, దయగ,–చతుర యేఁడీ–అననర్థమేమే? అయ్యయో! హాస్యమాడి నన్నేలవేధించుచున్నావు? నీ వెంతయో మంచిదానవని నే ననుకొనుచుంటిని. సమయమునకు నన్నిట్లు మోసపుచ్చెదనని యనుకొనలేదే! కటకటా! నానమ్మినపరిచారికయే, నాకుఁ గూర్చుపరిచారికయే, నేను తల్లిగా భావించుచున్నపరిచారికయే, అట్టి పరిచారికయే నన్నిట్లువిచారములో ముంచుచున్న, నింక నాకేమియుపాయము?

పరి.—అమ్మా! మీకు నిజముగా నాతనిపై నంతమోహము కలిగినదా?

కుము.—అవును. నీతోడుగఁ బ్రమాణముచేసి చెప్పెదను. ఆతని నిజముగానే నేను గామించితిని.

పరి.—అమ్మా! ఒక్కనిముసములోనే కామించితిరా?

కుము.—అయ్యో! నీవు మరచితివికాఁబోలు.

క. ఎవ్వానిఁ జూచినంతనె
జవ్వని మోహంబు నొందఁ • జాలదొ, మఱి, తా

నవ్వాని నెన్న(దైనఁ,
నెవ్వలపునఁ గనదటంచు • నీవెఱుఁగవొకో.

పరి.—అట్లయిన, నింక మాటలవక్రతను మానెదను. మీకు నాతనిపై నెంత మోహము దయించినదో, పరీక్షించుటకే నే నిట్లువంకరగా మాటాడియున్నాను. ఇప్పుడు నిజమగు మీమనోభిప్రాయము తెలిసినది. నన్ను క్షమించుడు. సరిగా మాటలాడెదను. వినుఁడు. ఆతనిది కంచిలికాపుర మట. పేరు ప్రభాకరశాస్త్రియట. జలంధరరాజులనుఁ బ్రతినిధిగా నవాబుగారితో సేవ్రా రాజకార్యములనుగూర్చి మాటలాడుటకై వచ్చెనట. ఇక్కడ రెండుమూఁడు దినము లుండుట నిశ్చయమట. కాని, వచ్చినపని ముగియకున్నచో, మఱికొన్ని దినము లుండునట. బస పెద్దబజారు వీధిలోనఁట. ఇంకినేఁ జేయవలసినపని యేమి?

కుము.—ఆతని నెట్లయిన నిటకుఁ దీసికొనిరాఁగలవా?

పరి.—ఆపనికిఁ జతుర మనకు మిక్కిలిపనికివచ్చును.

కుము.—అవును. మఱచితిని. నిజమే. చతుర లోపుననున్నది. దానితోఁ గలసి యాలోచింపుము. పొమ్ము. ఎట్లయిన, నాతనిఁ దీసికొనువచ్చుభారము నీది.

పరి.—అమ్మా! తప్పక తెచ్చెదను. వేయికన్నులవానికైన నద్భుతమగునట్లు తెచ్చెదము. భయపడవద్దు. (పరిచారిక పోవును)

కుము.—(స్వగతము) ఆహా! యేమి యాతనిసౌందర్యము!

ఉ. చేరలఁ గొల్వవచ్చుఁగద, • చెన్నలుగుల్కెడువానికన్నులక్
మూరలఁ గొల్వవచ్చుఁగద, • ముద్దులకీతము, వానివక్షమున్;

బారలఁ గొల్వవచ్చుఁగద, నల్లనిచక్కనిసోగకన్నులీన
హా! రమణీమణీహృదయ హారి యనంగ నితండె యౌఁ గదా.

ఉ. చక్కఁదనాలమక్క; యెల జవ్వనమున్ రతిసంపుటిక్క; మేల్
గ్రిక్కడు నీవి మొక్క, నయఁ గారపుమాటల తేనెమక్క; నెం
తెక్కనవీనిఁ దక్క నొరు నెవ్వనిఁ గోరిన నేమి లెక్క? యీ
యొక్కటి సోయగంబు కను వెన్నటికో, కనుపండువై తగన్.

ఉ. పున్నమరేని గ్రొందళుకు పొంపిరివోవఁగఁ జేయఁజాలు మేన్
వన్నెగలాఁడు; చొక్కపుఁద నమ్మరుఁ గాసిన్ నునునూగుమీసపుం
జెన్నుగలాఁడు; మేల్ చివురుఁ జేతులవాఁ డలమోవివాఁడు; సొం
పెన్నఁగలాఁడు, వాఁ డనుమ నెంతనుతించినఁ దన్వితీరునే?

ఉ. మవ్వపులేఁతనవ్వు ముఖమండలమందున నందమొంద, మేల్
పువ్వులఁబోలు పోడిమినిఁ బొల్పెసలారెడు రెండు చేతులన్
నెవ్వగ తీరునట్లు లత నిన్ నునుమేలపుఁ బల్కుతోడ, నే
జవ్వని కౌఁగిటం బొదువఁ జాలునొ, దానిదె భాగ్యమౌఁ గదా.

అయ్యయో! పతిభక్తివిడచి, నే నేల యిట్టిపాపపుటూహలలోఁ బడియున్నాను? ... ... ... ... వనితలకు పతిభక్తి యెట్లబ్బును?

ఉ. ఎవ్వఁడు దైవతుల్యుఁడని యిమ్మగ నెమ్మది నమ్మియుండునో
ఎవ్వనిపాణిఁబట్టి సకలేప్సితముల్ గనఁజాలియుండునో,
ఎవ్వఁడుతక్క వేఱుగతి యెవ్వఁడు లేఁడనినమ్మియుండునో,
అవ్విభుఁ డబ్బినప్పుడుగదా, పతిభక్తి జనించు నింతికిన్.

లోకమునఁ బతివ్రతలైనవారిలో, ముక్కాలుమువ్వీసము తాము వలచినభర్తలను బెండ్లియాడినవారే. నేను జన్మించినది క్షత్రియకులము. అయిననేమి? ధనాశాపిశాచ

ము ప్రోత్సాహము చేయుటచే, నాతలిదండ్రులు నన్నీ కటికతురకకుం గట్టిపెట్టిరి. మూఁరెడుమీసమును, బారెడుగడ్డమును, మిట్టనుదురును, బోడితలయును గలిగి, చెంతఁజేరిన హుక్కాకంపు కొట్టుచుండు నీప్రత్యక్షరాక్షసుని దలఁచినపుడెల్ల గుండె లదరి, యొడలు కంపమెత్తుచుండును. పవిత్రమగు నార్యకులమునఁబుట్టియు, నపవిత్రమగు తురుష్కశరీరముం దాకవలసివచ్చిన నాకుఁ బతిభక్తి యెట్లబ్బును? నన్నెవ్వఁడైన సుందరాకారుండగు నొకహైందవకుమారునకుఁ బెండ్లిచేసిన, ముష్టియెత్తినైనఁ జేరెడుగంజి త్రావుచు, నాతనిపాదములొత్తుచు, పతివ్రతనై యుందునుగదా. అట్లు కాకపోవుటచేతనే కదా, నేనితనినాశింపవలసివచ్చినది.

మత్తకోకిల. ఏనుఁజేయఁగనెంచియుండినకృత్య ♦ మెంతయుఁబాపమే?
మానసంబునఁ గోరియుండిన ♦ మాననీయుఁడె కాంతుఁడౌ
మానినీమణికంచునమ్మిని ♦ మానవుల్ వచియింపరే?
మానఁబ్రాణము నిల్చునే, యను♦మానమేటికి నాకిఁకన్.

నాప్రయత్నము సమకూర్చుటకుఁ జతురయున్నది కదా. నాకేమిభయము? (నిష్క్రమించును).

## స్థలము 2. నాగావళీతీరము.

[కుముదిని మేడప్రక్కనున్న యిసుకతిన్నెయపైఁ గూర్చుండి ప్రభాకరుఁడు సంధ్యావందనముఁ జేసికొనుచుండును].

(స్వగతము) ఆహా! క్షణక్షణక్షీయమాణ సాంధ్యరాగసంయుక్తంబగు నయ్యపరాచలంబుం జూడఁజూడ, జ్వరబాధ

చే క్షణక్షణక్షీయమాణుఁడగు నా తండ్రి జ్ఞాపకమునకు వచ్చు చున్నాఁడు. పాపమంతటికష్టకాలమున నేనుసమీపమున లేకుంటచే నాతఁ డెంత వంతనొందుచున్నాఁడో! కటకటా!! ఇట్టిసమయములోనే నన్నిక్కడకు భగవంతుఁడు తీసికొనిరావలెనా? తెచ్చెఁబో, వచ్చినపని వేగముగాఁ దెరిపిచేయరాదా? వారముదినములుండినగాని, పని తెరిపి కాదని శిరస్తాదారుగారు స్పష్టముగాఁ జెప్పినారు. అవశుఁడై యున్న నాతండ్రికి నింక నెవరు పరిచర్యసలిపెదరు? ఆతనిస్థితియెట్లులుండునోగదా! అత్యుదారచిత్తుండగు నాతని ప్రస్తుతస్థితి తలఁచునప్పుడెల్ల నా గుండెలలో రాయిపడుచుండును. ఆతని యౌదార్యము నేనేమని యెన్నఁగలను.

సీ. చదువుసాములు నేర్ప • శ్రమము నొందును గాని,
వ్యర్థమ్ముగాఁ దిరు • గాడనీఁడు;
మంచిమాటల బుజ్జ • గించు చుండును గాని,
మనసునొచ్చెడు మాట • లనఁగఁబోఁడు;
దండనల్ విధియింపఁ • దలఁపునొందఁడు గాని
తప్పుచేసిన యప్పుఁ • డొప్పుకోఁడు;
సమ్యక్ప్రవర్త నా • సక్తి నేర్పును గాని,
దుష్ప్రవర్తనమునం • దుఁ జొరనీఁడు;
గీ. దానధర్మాది సత్క్రియా • చరణబుద్ధి
ప్రబలమొనరించుఁ గాని, కే • వలధనేచ్ఛ
కలుగఁ బోనీఁడు నాయందుఁ • గలరె నాదు
జనకునకు సాటి జెప్పంగ • జనములౌర?

నాజనకుఁడు నాయందింత యాదరణము చూపుచున్నను,

దానికింగారణము నాతల్లికినాయందుఁగలయనురాగమేయ
నిచెప్పవలసియున్నది. ఆహా! యేమియామె వాత్సల్యము?

సీ. ఎండలోఁదిరుగాడి, ♦ యింటికేతెంచినఁ
జిన్నికన్నా! యంచుఁ ♦ జేరఁజీరు;
చీరి, చల్లనిదన ♦ చేతులతో మేను
నిమురుచు నలయిక ♦ నీఁగు సేయు;
చేసి, మజ్జనమాడఁ ♦ జేసి, తెల్లనిబట్ట
లమరించి, మంచియ ♦ న్నము వెట్టు
వెట్టి, భుజించెను ♦ నేఁ డెంతనుఁజేరి,
నీతివాక్యమ్ములెన్ని ♦ యయిన గఱపు;
గీ. గఱపి, యామాట లెదనాటఁ ♦ గా నొనర్చి
వత్స! యీరీతిఁ జనుమంచుఁ ♦ బ్రోత్సహించు;
తిరుగఁజెడుత్రోవ, మెల్లఁగా ♦ ద్రిప్పఁబోవు;
తల్లియన, నాదుతల్లియే ♦ తల్లి యహాహా!
సీ. జనకుని దయనువ ♦ చ్చిన పైకముపోదు,
తల్లి నేర్పిన సత్ప ♦ థమ్ము కాదె?
జనపుఁ డాజ్ఞించియి ♦ చ్చిన ధనమ్ములకీసు,
తల్లి నేర్పిన సత్ప ♦ థమ్ము కాదె?
జనపుండు శ్రీమను దె ♦ చ్చిన కీర్తికిదోడు,
తల్లి నేర్పిన సత్ప ♦ థమ్ము కాదె?
జనకుండు కోరిమె ♦ చ్చిన యున్నతికిఁబ్రోదు,
తల్లి నేర్పిన సత్ప ♦ థమ్ము కాదె?
గీ. కొమరులభివృద్ధి నొందఁగాఁ ♦ గోరువారల,
జనకునకుఁదోడుఁ దమిఁగోడఁ జ ♦ ననికూడఁ
బలుపితమ్ములఁ గా శ్రీమం ♦ పడఁగవలదె!
తల్లియన, నాదుతల్లియే ♦ తల్లి యహాహా!

ఆహా! ఆమూల, నీవునిలుచుటచే నేర్పడినమడుగునదు మఁ బుట్టిన సరోజని, దేశాంతరగామియగు ప్రభాకరునిఁ జూచి, మోమువంచి ముహుర్ముహుర్నిష్యంది మకరందబిందుసందోహరూపంబునఁ గన్నీ రెట్లువిడుచుచున్నది?

ఆహా! సరోజినీ!! యేమి నీసుగుణ సంపత్తి!!!

సీ. కలనైన ననృతంబు ♦ పలుకఁగా నొల్లవు,
సత్యమాడుటయన్న, ♦ సంతసింతు;
హాస్యమ్మునకునైన, ♦ నప్రియ మ్మాడవు,
ప్రియము వల్కుటయన్నఁ ♦ బ్రియము గనెదు;
కోపమావంతైనఁ ♦ గొనఁబోవ వెప్పుడు,
ననుకంపఁ జూపఁగా ♦ నరయుచుందు;
ఇల నధర్మమ్మునఁ ♦ గలలోననొంచెదవెందు
ధర్మమ్మటన్న, మోదము వహింతు;
గీ. చిన్నతనమునసుండియు ♦ నన్నుఁ జూచి,
యలతినగవు మొగమ్మున ♦ మొలకలెత్తఁ
గమ్మ తేనియపలుకులఁ ♦ గుమ్మరింతు,
వింతి, నినుఁబోలు కన్నియ ♦ లెందుఁగలరు ?
సీ. వికలాంగులంజూచి ♦ వెతలనొందుటెకాక,
చేతనౌ సాయంబు ♦ చేయుచుందు;
బీదసాదుల నింత ♦ యాదరించుటెకాక,
వారిఁజూచి యసహ్య ♦ పడఁగఁబోవు;
అధమజాతులఁ దూల ♦ నాడకుందుటెకాక,
వారియుద్ధరణంబె ♦ కోరుచుందు;
చదువు నేర్చుటయన్న ♦ సంతసించుటెకాక,
మంచిపాత్రములె ♦ యెంచుచుందు;

గీ. ఎన్నిరీతుల నీయంద • నెంచిచూచ,
సుగుణమేకాని, దుర్గుణ • మ్ము గనరాదు.
వయసునం జిన్నదానవే • యయితిగాని,
బుద్ధులం బెద్దదానవే • పొలతి నీవు.

బంగారమునకు వెలిగారము చాడ్పున, నీసుగుణ సంపత్తికి నీయందము తోడై, నీకెంతయో వన్నె తెచ్చుచున్నది.

చ. సరసిజనేత్రరో! వినుము, • చక్కఁదనంబున నిన్నుఁబోలు నా
రరసినఁ గానరారు, నిజ • మాడెద నిచ్చక మేల? సృష్టిలో
సరసిజసంభవుం గెలువఁ • జాలఁగ నా సుమసాయకుండె నిన్
గరువమునన్ సృజించె నను • కల్పననీయెడ సార్థమే యగున్.

మ. పదియార్వన్నెపసిండి క్రొన్నిగలు సం • భావ్యంబులే యయ్యెఁ జ
క్కఁదనంబం దసమానమై తగు భవ • ద్గాత్రంబునం దుంటచే,
మదినెన్నంగఁ బ్రసూనగుచ్ఛముల సం • సర్గంబునన్ సూత్రమం
బుదవేణీ! ఘనవేణికా భరణమై • పొల్పొందుటల్ చిత్రమే?

సీ. ఆసేతు కాశ్మీర • లాంత భూములయందు
నినుబోలు వజ్రమెం • దేనిఁగలదె
విద్వజ్జనంబుతో • వెవలి వ్యాపించు నీ
సుగుణసంపదఁ దెల్పు • సొగసుకతలు;
నెఱవక్కనైనక్రొ • న్నిగల బంగరుబొమ్మ,
నీపజ్జనల్లనై • నెటనిలిచెను;
నీసోయగమెకాని, • యేసోయగంబైన,
నామనెమ్మది నిల్వ • బోదుసుమ్ము;

గీ. సతి, వసూధనికొసఁగున • చ్చరతనంబు,
పడతి సావిత్రి సుగుణ సం • పదయుఁ గలిపి,
కరువుఁబట్టి పిరించి యొ • క్కటిగ నిన్నుఁ,
బోఁత పోసె నటంచు నే • నెప్పుడుఁ దలంతు.

చ. నలి వినఁ గూరుచుండినను, నిద్దురఁబోయిన, మేలుకొన్న, నె
చ్చెలులనుఁ బల్కరించినను, జెంత నొకండును లేకయున్న, దొ
య్యలి! నినుఁ గూర్చియే తలఁపులంకురించెడిఁ జుమ్ము, మనోజ్ఞమైన నీ
పలుకులు మిటారిసోయగము కోమలి నావగనెల్లఁ బాపెడున్.

(ఉత్తరీయము మీఁది కెగయును).

(సంభ్రమమున మీఁదికిఁజూచి) ఆరరె! యేమిది? ఉత్తరీయ మెగురుచున్నది? ఏమిది? ఎంత మోసము? (పట్టుకొనుట కెగురబోయి, అందుకొనలేకుండును).

అయ్యయో! ఎంత మోసమయ్యెను? నాఁడు దమయంతినిఁ గూర్చి విచారించుచున్నప్పుడు నలుని యుత్తరీయము పక్షులెత్తుకొని పోయెనని చదివి యున్నానుగాని నేఁడు నాకే యట్టియవస్థ వచ్చెనా? పైమీఁదబట్ట పక్షులెత్తుకొనిపోయెనను సామెత సార్థకమయ్యెనే? ఇది యెవ్వని మోసమైయుండును? నేనెఱింగి నంతదనుక నెవ్వరికినపకారము చేయలేదే!

[చతుర—రాజభటుని వేషముతో ప్రవేశించును].

భటు.—రమ్మంటున్నారురండి. (రెక్కఁబట్టిలాగును).

ప్రభా.—ఛీ! ననుముట్టకు. దూరముగానుండు. నన్ను రమ్మనుచున్న వారెవ్వరు?

భటు.—మీరెందుకు వింతగా చూస్తున్నారు?

ప్రభా.—నాయుత్తరీయ మెట్లు మీఁద కెగసెనోయని.

భటు.—అందుకే రమ్మంటున్నారు.

ప్రభా.—ఎవ్వరు ?

భటు.—మీ పైఁటచీ యెవరు తీసేరో వారు.

ప్రభా.—వారెవ్వరో చెప్పరాదా?

భటు.—వస్తే మీకుఁ దెలియదా?

ప్రభా.—(తనలో) ఇది నాయుత్తరీయ మెగురుటకన్న వింతగా నున్నది. ఇది యేమి దయ్యములయొద్దా, లేక, కలఁ గనుచున్నానా? అసురసంధ్యాకాల మప్పుడు కలయేమి?

భటు.—మాటాడ రేమి? రాండి (మరల లాగఁబోవును).

ప్రభా.—దూరముగానుండుమన్న వినఁబడదా? ఎవ్వరు రమ్మన్నారో చెప్పుము.

భటు.—ఎవ్వరా? వారే.

ప్రభా.—అనఁగా?

భటు.—అనఁగా నవాబుగారి బావమరది.

ప్రభా.—అన్నా! చచ్చితినిగదా. రాజుల బావమరదులును, వేశ్యల యన్నదమ్ములును, కొన్నిచోటులఁ గొరకరాని కొయ్యలై, తమకు లోబడు వారిని వేపుకొని తిందురు. నే నిప్పు డేమి చేయుదును?

భటు.—వచ్చెదరా, రారా, మాటాడ రేమి?

ప్రభా.—ఈమేడ నవాబుగారి బావమరిది గారిదా?

భటు.—అవును.

ప్రభా.—వారేనా! నాయుత్తరీయమును దీసినవారు?

భటు.—అవును. రండి (మరలలాగఁబోవును).

ప్రభా.—(కొంచెము దూరముగాఁ బోయి) ఏల తీసిరి?

భటు.—ఏమో' హాస్యానికి కాఁబోలు.

ప్రభా.—నీవు తెచ్చి యిచ్చివేయఁగూడదా?

భటు.—మీతో నేదో కబురు చెప్పాలట. రండి.

ప్రభా.—అన్నా! గట్టిచిక్కు వచ్చినది. పోయిన నేమి వచ్చునో? ఏమివచ్చును? సరే! యెవ్వరైన కానిమ్ము. వారు దుర్మార్గులే యయిన, మంచిమాటలవలన శాంతపరచెద. పోయినచో నష్టము కలుగ నవసరము లేదు. కాని, పోకున్న నష్టము రావచ్చును. ఇప్పుడు కార్యార్థినై యున్నాను. నవాబుగారితోఁ జెప్పి, నాపైని కోపము పుట్టించి, నాపని పాడుఁజేసిన నాకేకాక, నాతండ్రికిఁ గూడ నపకీర్తి కలుఁగఁ జేయును. నాకు నష్టము వచ్చిన, నే భరింపఁజాలుదును గాని నాతండ్రికి నపకీర్తి కలిగిన, భరింపఁజాలను. ఏది యెట్లయిన, నో భగవంతుఁడా! నీవే నాకుఁ దోడు.

మ. ఖరదంష్ట్రోత్కటనక్రభూరిమకరా ◆ క్రాంతాత్ముఁడై, సాహసా
కరవర్గంబున "పాహిమాం, సగుణసా ◆ క్షాద్రూప, దేవేశ్వరై
ఖగగ బ్రార్థింపఁగఁ గోరి, వారణపతిన్ ◆ గాపాడుచందంబునన్,
కరుణావారిపరిషేచనం బొసఁగి, నన్ ◆ గాపాడవే, దైవమా!

(భటునితోఁ బోవును).



స్థలము 3. కుముదిని మేడ.

కుము.—(స్వగతము) ఆహా! చతుర యెంత నేర్పరి? ఆమె సార్థకనామయే కదా. ఆయౌవనపురుషు నెట్లో మోసపుచ్చి తీసికొని వచ్చుచున్నది. ఓగండుఁగోయిలా!

ఉ. ఎక్కడఁ గంటినో సఖుఁడ ♦ సాఁగుచు నుండ్రు, మాని నొక్కనై,
నెక్కొలి, పంచనమ్ముగను ♦ నెత్తము: బాడుచు, తేఁజిపుష్పముల్
మెచ్చను, దూరమూరముగ ♦ నే సరియించుచు నుండు నీవిఁకన్
జక్కఁతి నెంచఁ బోయెదవు? ♦ నిన్నిటఁ గట్టెద బాహువల్లులన్.

అదిగో! మేడ మెట్టులపై మనుష్యుల యలుకు డగుచున్నది. వా రిప్పుడే వచ్చినట్లున్నది. నేనీప్రక్కగదిలోనికిఁబోయెద. (పోవును). (భటునితో ప్రభాకరుఁడు ప్రవేశించును).

ప్రభా.—(తనలో) ఇది యెవ్వరి గదియై యుండును? నిజము గాఁ బురుషులదేనా?

(తెరలో) చతురా! తీసికొనివచ్చితివా? కూర్చుండుమనుము. ఇప్పుడేవచ్చెద.

భటు.—చిత్తము, ఆయ్యో! ఇక్కడ కూర్చుండండి. వారు యిప్పుడే వస్తారు. (లోనికిఁబోవును).

ప్రభా.—ఇందేదో మోసమున్నట్లు నాయంతరాత్మ చాటుచున్నది. ఇది నిజముగాఁ బురుషులు నివసించు తావేనా? అయ్యయో! నేనేల వచ్చితిని? పోయినయుత్తరీయము పోయిన దే యనుకొనక, దానికై మరల నేలయాసపడితిని? ఇప్పుడేమి మోసము రానున్నదో కదా! కానిమ్ము, గతించిన దానికి వగచి యేమి ప్రయోజనము? ఓదైవమా! నీవేనాకు దిక్కు. పాపపుఁ జింతలలోఁ బడకుండఁ గాచు భారమునీది. (చతుర స్త్రీరూపముతో ఫలములను, పుష్పములను, బఱ్ఱెరములతోఁ దెచ్చి బల్లపై నుంచి, మరల లోనికిఁబోవును.

ఇది యంతయు నేమి? నేను కొనినట్లే యగుచున్నదే!
(కుముదిని వచ్చును).

కుము.—అలసితిరి కాంబోలు. దయచేసి, కూర్చుండఁగూడదా! (విసరును).

ప్రభా.—వలదు. వలదు. విసరవలదు. మీ రెవ్వరు? నవాబుగారి బావమరదిగా రెక్కడ?

కుము.—వారింకఁ గొంచెము సేపునకుఁగాని రారు. అందనుక విశ్రాంతి తీర్చుకొనఁ గూడదా? (మరల విసరును).

ప్రభా.—వలదు, విసరవలదు. శీతకాలములో విసరుట యేమి? వారు రాకున్న, పోనిండు. మీ రెవ్వరు? నన్నేలయిచ్చటకుఁ దెచ్చితిరి? నా యుత్తరీయ మెవ్వరు తీసిరి?

కుము.—సరే! చెప్పెదను గాని, పోనిండు; ఈ ద్రాక్షపండ్ల గుత్తి చూచితిరా, యెంత మనోహరము గానున్నదో! కొన్ని పండ్లు తీసి తినుఁడు. (అందిచ్చును).

ప్రభా.—అక్కర లేదు. అక్కడనుంచి వేయుఁడు. నా ప్రశ్నముల కుత్తరము చెప్ప రేమి?

కుము.—మీ రట్లు నిలచి యున్నచో, నే నెట్లుత్తరము చెప్పఁగలను? ఇంచుక శాంతించి, కూర్చుండి, విన్నచో, నంతయుఁ బూర్తిగాఁ జెప్పెదను.

ప్రభా.—(తనలో) ఇది నిజముగా మోసమే. కానిమ్ము, ఇప్పుడు వగచిన నేమి లాభము? తగిన ప్రతిక్రియ యారయవలయును. (ప్రకాశముగా) సరే—అట్లనే కూర్చుండెదను. నా ప్రశ్నములకు నుత్తరము చెప్పుఁడు.

కుము.—చెప్పెదను. ఈ కదళీఫల మెంత సొగసుగా నున్నదో చూచితిరా! ఇది యొక్కటి నైనఁ దినుఁడు. (అందిచ్చును).

ప్రభా.—నాకేమియు నక్కర లేదు. వలదనిన బలవంతమా! నా ప్రశ్నముల కుత్తరము చెప్పకున్నఁ బోనిండు. నా యుత్తరీయము నాకిచ్చివేసిన, నేఁ బోయెదను.

కుము.—మాటిమాటికిఁ బోయెదను, పోయెద ననెద వేమి? పోక నిలచి యుండుదురా? చూచితిరా, పూచిన కలువపైఁ గొదమ తుమ్మెద యెట్లు మాటిమాటికిని, వ్రాలుచున్నదో.

క. విరిసిన యీ చెంగలువం
బరిపరి వ్రాలుచును, నెంతమూర్చిన, మానం
బోరయదు, తుమ్మెదయియ్యెడ;
మరులుకొ మఱపంగఁబోదు, ♦ మగజాతిగదా!

ప్రభా.—ఈ మాట లన్నియు నాతో నేల చెప్పట? నా యుత్తరీయ మీయకున్న, మానివేయుఁడు. నేఁబోయెద (నిలచును).

కుము.—ఈతని మనస్సు రాయివలె నున్నదే! ఇంక మఱియొక త్రోవం బరీక్షించెద.

(ప్రకాశముగా) చతురా, ఉత్తరీయము దెమ్ము. విప్రకుమారా, చూచితివా, చలువరాతితోఁ గట్టఁబడిన యీ మేడ. నీవు కాపురముండు నిల్లింత సొగసుగా నుండునా?

ప్రభా.—బీదవారికి మాకిట్టి మేడ లెట్లు వచ్చును?

కుము.—ఈ చిత్తరువులు చూచితివా? గోడలపై నిలువుగఁ జి

ప్రేరింపఁబడి, జీవముతోనున్నవా యను సందేహము భ్రమింపఁ జేయుచున్నవో! ఇట్టివి మీయింటఁ గలవా?

ప్రభా.—సంసారుల కిట్టి యైశ్వర్యము లెట్లు వచ్చును.

కుము.—పోనీ—చూచితివా, యీవిద్యుద్దీపములు నీహంసతూలికాతల్పములును; ఇట్టివైనఁ గలవా?

ప్రభా.—ఇట్టి భోగములన్నియు మాకెవ్వ రిత్తురు? నాకవ్యవధి లేదు. నేఁ బోయెద.

[ప్రభాకరుఁడు పోఁ బోయిన, కుముదిని యడ్డము వచ్చును].

కుము.—చతురా, ఉత్తరీయమును చేసేమి? విప్రకుమారా, ఇట్టి భోగముల నెప్పుడు నెఱుగనని చెప్పుచున్నావు. అట్లైన నప్పుడు చూచియైన నించుక యానందించి పోఁగూడదా?

ప్రభా.—ఇంతటి యైశ్వర్యములు మా కక్కర లేదు. మా సామాన్యపు మేడలును, సామాన్యపు పటములును, సామాన్యపు పరుపులు, దీపములు నే మాకు నిష్టము. అలవాటు లేని వానిఁ గొండపై నెక్కించిన, నోడలు తిరుగు నట్లు, ఇట్టి యైశ్వర్యము లబ్బినచో, మాకు మనసు చెడిపోవును. కావున, ఇట్టి యైశ్వర్యములు మే మెప్పుడును గోరము.

కుము.—అట్టివి లేవని పరితపింపకు. కాని, అయాచితముగా వచ్చినప్పుడును మానివేయుదురా?

ప్రభా.—అప్పటిమాటకై యిప్పుడు పరితపింపనేల? నా యుత్తరీయము నిచ్చునట్లు కన్పట్టదు. పోనిమ్ము. నాకుఁ ద్రోవయిమ్ము. నేఁ బోయెదను. (కుముదిని అడ్డము గానిలచును.)

కుము.—(తనలో) ఈతని గుండె రాయియుగాక, ఇనుపైయు న్నదే. (ప్రకాశము) ఉత్తరీయమిప్పుడే యిచ్చి వేసెదను. దానితో నాకేమిపని? చతురా! ఉత్తరీయముఁ దెమ్ము. (తనలో) ఈతఁ డింక నిట్టి గూఢ వాక్యములకు లొంగఁడు నిజము చెప్పి యొప్పించెదను. (ప్రకాశముగా) విప్రకుమా రా! చల్లకు వచ్చి ముంత దాచిన నేమిలాభము. నీవు నేటి యుదయమున నాగావళిలో స్నానము చేయుచుండ, నీమేడ పైనుండి చూచి, నీపై మోహము నందితిని. నేనొక క్షత్రి య స్త్రీని. నవాబు నాతలితండ్రులకు ధనమిచ్చి, నన్నుఁ బెండ్లియాడెను. అతఁడు తనప్రాణమంతయును నాపై నే నిల్పును గాని, నాకాతనిఁ జూచిన నిష్టములేదు. నీవు విప్ర కుమారుఁడవు. ఇంకను,—

క. తారుణ్యము, లావణ్యము,
కారుణ్యము, కలిగి, వెలుఁగు • కాంతుఁడవని, ని
న్నారంగను, గోరం జని,
చేరంగనురాదు, నాదు•చిత్తము, నన్నుఁ.

అనదనైయున్న నన్నుఁ జేపట్టి,నాప్రాణములునిల్పు భారమునీది.

ప్రభా.—పాపము శాంతించుఁగాక. అయ్యయో! యెట్టి వలలోఁ జిక్కుకొంటిని?

కుము.—ప్రభాకరా! జవాబు చెప్పవేమి? నీవు వట్టి రాతిగుండె వాఁడవని నేఁ బోల్చియుంటచే, కబురంపిన నీవురావని, యి ట్టిమాయపన్నితిని. నేను జేసిన నేరమును క్షమించి, నాపై దయఁ బూనుము. నీవు నామాటవినకున్న,బలవంతముగనైన,

ప్రభా.—ఛీ! నోరుమూయుము. (తనలో) నట్టి మాటలపలనఁ బ్రయోజనము కన్పట్టకున్నది. కొంచెము హితోపదేశము చేసి చూచెదను. (ప్రకాశముగా) పరకాంతవగు నీవు నాతోనిట్లు మాటాడవచ్చునా?

కుము.—(తనలో) ఓహో! ఇప్పుడు నీతిబోధమొనర్చునా గాఁబోలు!! (ప్రకాశముగా) నేను పరకాంత నెట్లయితిని? శత్రుకాంతనుగానే! నాకును నీకు నెన్నఁడును శత్రుత్వము లేదు గదా!

ప్రభా.—పరకాంతయన, నాతాత్పర్యము, అన్యస్త్రీ. అనఁగా అన్యుని యధీనమునను స్త్రీ.

కుము.—అయ్యయో! నీ వంచున కా, భయపడుచున్నావు? భయపడవలదు. నేనట్లుచూచినను, పరకాంతనుగాను. నేను, అనఁగా, నాశరీరము. పరుని యధీనమందున్నను,—ఇదియు సందియమే-నాయాత్మమాత్రము నాయధీనమందేయున్నది. దాని నిప్పుడు నీయధీనము చేసితిని. కావున, నీకాభయ మక్కరలేదు.

ప్రభా.—ఇష్టముగనో, యనిష్టముగనో, యొకని చేపట్టితివి కదా. పతివ్రతవై యుండవద్దా? పతికుష్ఠగ్రస్తుఁడయ్యును, వృద్ధుఁడయ్యును, నిష్ప్రయోజకుఁడయ్యును, పూజనీయుఁడేకదా!

కుము.—ఓహో! ఇవియన్నియును ఛాందసపు నీతులు. ఇట్టి నీతులు కొన్ని నాకును దెలియును. చెప్పువారే కాని, చేయువారరుదు. ఈనీతులను గ్రంథములలో వ్రాసిన యామగ

వారికే, ఏజబ్బుదో, ఏగ్రుడ్డిదో, పెండ్లము దొరికినప్పుడు, ఏక పత్నీవ్రతము నిలుచును గాఁబోలు! ఇట్టిమాటలు నాకుఁ జెప్పకుము.

ప్రభా.—ఏమనుచున్నావు? పతివ్రతలలోఁ బేరు కాంచిన దమయంతిని, సావిత్రినిచూడలేదా! రాజ్యభ్రష్టుఁడై, యరణ్యంబునఁ దన్నొంటిగా విడిచిన భర్తపై భక్తిమానినదా, దమయంతి? అతిదరిద్రుఁడై, కందమూలములం దినుచు, ఆకటింపటునగిలియున్న భర్తను హీనముగా నెంచలేదా, సావిత్రి? వారియట్లే నీవును బతివ్రతవు కావద్దా?

కుసు.—ఓహో! ఏమి నీయుపదేశము?

క. ఈడున్, జోడుం దగుమగ
వాఁడు లభించుటయె, ముదము • వనితకు నొసఁగున్;
చూడఁగఁ బతి నైశ్వర్యము
తోడఁ బ్రయోజనము లేదు • తొయ్యలి కెందున్.

లోకములోఁ బతివ్రతలైన వారందఱు నిట్టివారే. పతివ్రత యని పేరొందిన ద్రౌపదియు, తనయైదుగురు భర్తలలో, భీమునిపై నెక్కువ మోహము నొందుటయు, తనకలభ్యుఁడైన కర్ణునిపై మోహము వీడకుంటయు వినలేదా? ఇట్టి యుక్తులు నాతోఁ జెప్పి యేల తప్పించుకొనఁ బ్రయత్నింతువు?

ప్రభా.—(తనలో) దీని యుక్తులు విపరీతముగా నున్నవే! దీని మనస్సింక నేరీతిగాఁ ద్రిప్పఁగలను? ఇట్లు చెప్పి చూచెదను. ఓయువతీ! జపతపోహోమ దానయజ్ఞములలో మునింగి,

యేకపత్నీవ్రతుండనై యుండఁగోరు నన్నేల యిట్టిపాపపుఁ త్రోవలం బెట్టఁబోయెదవు? నీ దయయున్న, నా యుత్తరీయము నిచ్చివేయుము. లేకున్న, వదలి వేయుము నేఁ బోయెద.

కుము.——నీచపాపములకు నేనుమాత్ర మభ్యంతరము చెప్పఁదాననా? కేవల సత్యకాలపు వానివలె, యేకపత్నీవ్రతమనియెదవేమి? చూచితివా, ఈ భ్రమరమును

సీ. నిగనిగలాడు జగ్గులను ♦ నిగ్గులకో మనుదా పురీపుమ,
దగుపియుగుత్తులం దిపటు ♦ దాఁగుము, తోఁగుము, వాత్రిలి, స్తూత్రి, మేళ్
సొగసగు తేనెఁ దాత్రిపుమ, ♦ జొన్నఁచు మన్నది, గంధుప్రేటి; యూ
జాముని, నాముజాతి, మగ ♦ జాతియు, గొత్రిస్పతి, తుమ్మెదల్, సదా.

ప్రభా.——అట్లయిన, వివాహనియమము లేలపుట్టినవి?

కుము.——వివాహనియమములు సంఘావశ్యకతకుఁ బుట్టినవి? అవి లేకున్న, సంఘము లల్లకల్లోలమగునని, యవి యేర్పఱచిన వారి యుద్దేశము.

ప్రభా.——అట్లయిన, నీకు సోదరసోదరీవివాహముకూడ నవసరము లేదా యేమి?

కుము.——అదియును, సంఘమునకై పుట్టినదే. దానివలని ప్రయోజనము దుర్బల సంతానములు లేకుండుటయే. ఈజిప్టు దేశమునఁ బూర్వకాలమున, నీనియమమంతగాఁ బాటింపబడనేలేదని నవాబుగారు చెప్పుచుండిరి. మహమ్మదీయులలో, నీనియమమున కొక్క ప్రవేశముగా, పినతండ్రి పిల్లలఁ బెండ్లియాడుచున్నారు. వీరాయాంధ్రబ్రాహ్మణులలోని మేనరికము లీ తెగలోనివే.

ప్రభా.—పోనిమ్ము. ఏదియేని యొకనియమము నైన ననుసరించి యుండవలెనా? లేక బడిదిగి, నీవలె విచ్చలవిడిగా నుండవలెనా?

కుసు.—అసలు నాతలితండ్రులచే, నియమమునువీడి హైందవకన్యనగు నన్ను తురుష్కునకుఁ గట్టిపెట్టినప్పుడు, నేనుమాత్ర మానియమము నేల పాటింపవలెను ?

ప్రభా.—సరే, నీవు చెడిన, నన్నుఁ గూడఁ జెడుమని యేదవా యేమి? నేను నియమముల ననుసరించియే యున్నాను గాన నన్నుఁ జెడఁగొట్టకుము. నీదయయున్న, నాయుత్తరీయమును దెమ్ము. లేకున్న, నాకుఁ ద్రోవ యిమ్ము పోయెద.

కుసు.—(తనలో) ఈతనిది ఇనుపగుండెయనుగాక, వజ్రపుగుండెయే యైయున్నది. అయ్యయో! యుక్తుల వలన నేమియు లాభము లేదు. దీనముగా వేడికొందును. (ప్రకాశముగా) ఓ సుకుమారశరీరా! చక్కెరవింటివాని వాడికోలలంబోని నీచూపులు నానెమ్మెనఁ దాఁకుటచే నెట్లు గాయము పడినదో చూచితివా? అబ్బా! నేనెంతని వేఁడుచున్నను, నీకుఁ జాలి లేదేమి? ఇది నీకు ధర్మమా! అబలనగు నన్నిట్లు వేధించుట నీకు న్యాయమా?

ఉ. పారములేని బాములకుఁ ♦ బాల్పడి, కోల్పడి స్వాస్థ్యమంతయున్
గోరికమొసంగితిన్, హృదయ♦మూర్ధ్న ధనమ్మును నీకు; నీయెడన్
జేరిసుఖింపనెంచితిని, ♦ చేకొని నన్ దయ నాదరింప కి
ట్లారనియగ్గిఁద్రోసి, కడు♦నారడిఁబెట్టుట, నీకుఁ బాడియే?

లోకమును మరచు నుద్దేశమున నెంతయో శ్రమపడి, నిన్నిక్కడకు రప్పించిన, వలదని త్రోసివేయుట నీకుఁ బాడియా?

గీ. స్పర్శచేఁగాని, నెమ్మేని • సరసరాని,
యఖిలతనురోగములకన్న, • నరసికన్న,
చూపుమాత్రాన, దేహానఁ • జొచ్చుఁగాన,
నతను రోగమ్ము, కడుఘన•మ్మగును జమ్ము.

అట్టి ఘనరోగంబుచేఁ బీడింపఁబడుచున్న నాకు స్వాస్థ్యము నొసంగఁ జాలు వైద్యుఁడవని యెంచిన నీవే నన్నిట్లు త్రోసిరాజుం జేసెదవా? అయ్యయ్యో, కటికివాని కన్న నన్యాయతరమగు నిట్టివృత్తి పూనుట నీబోటి యుత్తమవిద్యానిధికిఁ దగునా? రక్తమధ్యమునఁ బుట్టి, రక్తమధ్యమునఁ బెరిగి, రక్తమధ్యమునఁ జనిపోవు కటికివానికైన నిట్టి వజ్రపుగుండెయుండునా? నీకు నమస్కరించెదను. పట్టుదల విడచి, నన్నుఁ గౌఁగిలింపుము. రమ్ము.

ప్రభా.—తరుణీ! పరస్త్రీల నందర, సోదరీ భావమునఁ జూచుచు, స్నానసంధ్యాది నియమము లనుసరించుచు, శ్రోత్రియుముగా జీవించు నుద్దేశమున నున్న నాకు నీమాటలుకొంచెమైన రుచింపవు. కేవలైహికసుఖాసక్తులై, తుచ్ఛజీవనముఁ జేసి యపకీర్తిభాజనులైనవారికిఁ జేయు దుర్బోధలు నావంటి వైదికునకుఁ జేయుటవలన నేమియు లాభము లేదు. పూర్వజన్మప్రారబ్ధవిశేషమున నీమనంబునఁ జనించిన యీదురూహలు నీయంతరాత్మసాహాయ్యమునఁ బారఁద్రోలి, సన్మార్గసంచారవై, ఇహంబున యశంబును, పరంబున మోక్షంబునుఁ గొనుము. ఇట్టితుచ్ఛసుఖంబులపై నాసఁగొని చెడిపోకుము. దైవకటాక్షమువలన నీదుర్బుద్ధి తొలఁగుగావుత. నాయుత్త

రీయమ్మనీయకున్న, నీయొద్దనే యుంచుకొమ్ము. నేఁ బోయెద. (కుముదినియిష్టమైవచ్చిన, బలవంతముగ, తప్పించుకొనును)

కుము.—ఉత్సాహ. వలపు వలదు చనకు చనకు ♦ వచ్చునీకు కష్టముల్;
చలము, బలము, విడచి, యడఁచి ♦ చక్కఁజేయుమిష్టముల్;
కలికి పలుకు వినక, మనక, ♦ కాంచెదేల కష్టముల్;
కలఁత, యలఁత, కలుగు; తొలఁగు ♦ గౌరవంబు శిష్టముల్.

పోవలదు. చేయికాలినపై నాకులు పట్టుకొను లాభములేదు. నవాబుగారిపనిపై వచ్చినావు. నవాబు నేనెట్లు త్రిప్పిన నట్లుతిరుగును. నన్నిప్పుడు తప్పించుకొనిపోయిన, నీభావిసౌఖ్యము నంతయు నేలఁగోల్పోయెదవు? సిరిరా మోకాలొడ్డు వెడఁగు మానిసివి కాకుము. రమ్ము. రమ్ము, పోకుము. చెడిపోకుము. కలిపోయిన వెనుక, యెట్టి కనుగొనట వ్యర్థము.

ప్రభా.—ఏనష్టమైన రానిమ్ము. అంతరాత్మ నశించుట కన్న, నెక్కువ నష్టము కలుగదు. నీయిష్టమువచ్చిన పనిచేయుము. (వడివడిపోవును).

కుము.—(స్వగతము) చేయిజారిపోయెనే; నేనేమి చేయుదును? ఆహాహా! ఏమి యాతని వాక్చాతుర్యము? ఆనిందావాక్యములనైన మఱివినుటకుఁ బ్రాప్తిలేకపోయెనే! ఛీ! యెట్టివ్యర్థమగు జన్మమెత్తితిని? మృగతృష్ణఁజూచి, దానికై పరుగిడి యలయుక చెందు లేళ్లు తుదకట్టి వస్తువుం గానకుంటచే నిరాశనొంది తిరిగి వచ్చుగాని, దురాశగొల్పుచున్న వస్తువెంతయుత్నించినం జేఁజిక్కక, కంటియెదుటనే కన్పట్టు

చున్నప్పు డెట్లు జీవములతో నిలచి యుండఁగలను? ఆఁడు
జన్మమునకన్న నధమజన్మ మెద్ది?

సీ. అజ్ఞానలంబితా ♦ హాస్యాస్పదంబునఁ గౌఁగి
లించుకన్నఁడఁ బ్రేమించియుంటి;
ఆకర్ణదీర్ఘంబు ♦ లైన నేత్రంబుల
నన్నుఁ జూచుచుండు ♦ నెన్నియుంటి;
అపరిపదీనకే ♦ శాగ్రంబులఁ దనున్
గట్టివేయుఁటంచు ♦ నమ్మియుంటి;
అమూల్యరాగమై ♦ యధర రసమిచ్చదం
బందిచ్చి, మెచ్చునం ♦ చరసియుంటి;

గీ. అక్కటా! యెన్ని యాసల ♦ నందియుంటి,
నన్నియును వట్టి యడియాస ♦ లయ్యె నేఁడు;
పలుకుఁబలుకున కప్పురంపుఁ ♦ బలుకులొలుకు,
సతినిఁ గను భాగ్యమింక ♦ నాకబ్బఁబోదె?

సీ. నిందఁజేసిన నేమి? ♦ నిద్దంపు టద్దంపు
తళుకుఁ జెక్కులసఁ ♦ బంటఁ గలిగె నాకు;
తూలనాడిన నేమి? ♦ తులకించు పులకించు
కలికియందము చూడఁ ♦ గలిగె నాకు;
త్రోసివేసిన నేమి? ♦ తులలేక, వెలలేక,
యలరు వాతెర ముట్ట ♦ గలిగె నాకు;
మోసపుచ్చిన నేమి? ♦ మెలుకంచు, కలుకంచు,
పలుకు మేలమ్మాడఁ ♦ గలిగె నాకు;

గీ. మేలమాడంగ, వాతెర ♦ మెల్లముట్ట,
నందమునుఁ జూచి త♦న్మయతం దనర్పఁ
జెక్కులంటుచు, నింపునఁ ♦ జొక్కుచుండఁ,
గలిగిన సుగంపు తెరవెలుఁ♦గంగలానె?

సరే-ఆతఁడు నన్నిప్పుడు మోసపుచ్చి పారిపోయెనుగదా. నేనాతని మోసపుచ్చి మరల వలలో వేసికొనలేకపోవుదునా పరమభక్తాగ్రేసరుఁడగు విప్రనారాయణునంతటి వాఁడే, కామినీవశుం డయినప్పు డీతఁ డన నెంతటివాఁడు? నాకుఁ జేదోడు, వాఁదోడుగఁ జతుర యున్నదిక దా?

(చతుర ప్రవేశించును) చతురా, రాజభటునివేషమున నీవాతని మోసపుచ్చి తీసికొనివచ్చితివి గాని, నేను దక్కించుకొనలేక పోయితినే.

చతుర.—అమ్మా! మేమప్పుడే మఱియొక్క యుపాయమాలోచించినాము. తెల్పెదము రండు.

కామ.—ఓయుత్తరీయమా, నీవు నాకెంతయో యుపకార మొనరింతు వనుకొంటిని గాని, ఇట్లు మానము వహింతువని యనుకొనలేదే. నిన్నుఁ జూచిన, నాకు మచ్చరము వృద్ధియగుచున్నది?

ఉ. ఎన్ని విధంబులన్ జతన • మేనొనరించిననైన, నాదు కే
లన్నిలువంగఁబోవని య • లభ్యపదార్థము, సంతసంపు మే
ల్మిన్నలలందుమండు సుకు • మారుని కంఠముఁ బాసియుండఁ బో
వెన్నడు; నీయదృష్టమె య • దృష్టము, చక్కని యుత్తరీయమా!

(నిష్క్రమింతురు).

స్థలము 4. శ్రీగాకుళములో నొకవీథి.

[ప్రవేశము ప్రభాకరుఁడు నడచుచు, (స్వగతము) అయయో! ఎంత మరువఁబోయినను మరపురాకున్నది. అ

స్తేనేమిలాగే వున్నాడు. (కాగితమును జూచుచు, నడుమనడుమ ప్రభాకరుని చూచుచు) ఆజానుబాహువులు. విశాలనేత్రములు, సువర్ణచ్ఛాయ, నూనూగుమీసములు, పెద్దకొప్పు వెడదనుదురు ... ... ... ... ... మీదేవూరు ?

ప్రభా.—(సంభ్రమముసఁ జూచుచు నూరకుండును).

రెండ.—(గట్టిగా) మాటాడవేం?

మూడ.—ఒళ్ళు గట్టిపడాలా యేమిటి?

ప్రభా.—(తెలివిదేరి) మాది కంచిలి.

మొద.—పేరు?

ప్రభా.—ప్రభాకరుఁడు.

మొద.—తండ్రి పేరు?

ప్రభా.—(తనలో) వీరు పూర్వోత్తరమంతయు నడుగుచున్నారు. కారణ మేమియై యుండును ? (ప్రకాశముగా) మా తండ్రిగారు అరుణాచలశాస్త్రిగారు.

మొద.—వీడే-సందేహం లేదు. పట్టుకొని బేడీలు వెయ్యండి.

రెండవ,మూడవ.— (బలవంతమున బేడీలు వేయుదురు).

ప్రభా.—ఏల నన్ను కట్టుచున్నారు? నేనేమి నేరము చేసితిని?

మొద.—మీపైని చోరీ నేరము మోపబడినది. మీరు కనుపడిన చోటుననే పట్టుకొని బేడీలు వేసి, ఖైదులో పెట్టుమని హుకుం.

ప్రభా.—ఏమేమీ, దొంగతనమా, నేనా! ఎప్పుడు-ఎక్కడ, ఎవ్వరు చెప్పిరి ?

రెండ-మీ ప్రశ్నలకు జవాబు చెప్పుటకు మాకవసరము లేదు.

మొద.—(తనలో) మేము చేయునది యెంతటి కఠినకృత్యమైనను, ఈతని యవస్థను నాకు జాలియగుచున్నది. (ప్రకాశముగా) మీరు గతరాత్రి కుముదినీదేవిగారి యింట్లో చోరీ చేసినారట. నవాబు గారిహుకుంప్రకారం మిమ్మల్ని పట్టుకొన్నాం. మరేమి సంజాయిషీ అడక్కండి. అడిగినా చెప్పే అవసరం మాకు లేదు. (రెండవ వాడును, మూడవ వాడును బలవంతమున ఈడ్చును).

ప్రభా.—(తనలో) అన్నా—కుముదినీ! అన్నంతపనిచేసితివా? అయ్యయ్యో, ఈ యపనిందనుండి నేనెట్లు తప్పించుకొనం గలుగుదును?

సీ. నను గాంచి, సంతోస ♦ మును బొందు మిత్రసం
ఘమ్మెంత శోకంబు ♦ గనునొ, యకట!
ననుఁబాసి యొకక్షణ ♦ మ్మును నిల్వలేని నా
జనకుఁ డెంతటి వంత ♦ గనునో యకట!
నను నొక్కప్రాణమం ♦ చును దలంచుచు నుండు
జనని యెంతటి చింత ♦ గనునొ యకట!
నను దైవమనుచు భా ♦ వన సేయు నా సరో
జిని యెట్టి చిక్కులం ♦ గనునో యకట!
గీ. హా! మనోంబుజతోషిణి ♦ హా! సువేషి,
సరసగుణపూర్త్తభూషిణీ, ♦ చతురవాణి,
హావభావభాభారశోభిణీ, ♦ ప్రజ్ఞశాలిని,
హా! సరోజిని, సుకుమారి, ♦ హా! సుమాంగి!!!

(నిష్క్రమింతురు).

# తృతీయాంకము.

### స్థలము 1. కంచిలిలోని సీధి.

[ప్రవేశము దాసి].

(స్వగతము) అబ్బా, యేటీచాత్తుల్లుగారి చాదస్తం? మూడిసిన్నై పంటలు దాటిపోనాయి, నడ నేదు, కూశో నేదు, గదా, యింకా పెళ్ళేట! ఏటో, కాలూ సెయ్యి పట్టడానికి కావలిస్తే, నానుండనే వున్నానుగదా. ఇంకా యేటికావాల? పాపం, ఆపిల్ల గొంతు గ్గొయ్యడానికి గానీ, పన్నిండేళ్ళ పనసపండునాంటి పిల్ల, పోనీ-మూనాగు రెడ్డికీ లేనా అయితే, మారుమనువు లేనా యెలిపో వచ్చు ననుకొంతే, బాపనోళ్ళు-అయినా, యీ బాపనోళ్ళు ఉరగబాటు మరిన్నీ, మొగుడు సచ్చిపోతే, మరో మొగుడి క్లెల్లిపో గూడదా? ఏటిములిగిపోయిందో? అంతఆశాంతం అయితే, కూటిపుండలు ముట్టనీకుండా వుణ్ణీకూడదా? మామే ఇనాగైతే, సచ్చిపోమా! అందులోనూ, అమ్మన్నగారి యిచ్చింతరం యెక్కడా సూడ్నేదు. ముసిలోడైతే అయినాడు. నగనట్ర యెడతాడు! సీరలు కొంటాడు! రైకలు కొంటాడు! సక్కగా ముస్తాబుసేసుకొని, యీ దిగుమ్మంలో కూకుండగూడదా? ముసిలోడైతే సెప్పుసేతల్లో యింటాడుగానీ, ఒయిసినోడైతే, యింటాడా? కాలికిందేసి మట్టేస్తాడుగాని. ఇంతకీ రాతగదా, ఆజెమ్మదేముడేటి రాస్తే అదే అవుతాది. నానుయెంతని సూరిపోద్దును? యెంత

సెప్పినా, యినడు! ఆశౌత్తుల్లుగారినే బతిమాలమంటాను. నా నేటి సేస్తాను? సస్తానాయేటి, యినకపోతే. (నిష్క్రమించును).

—:o:—

## స్థలము 2. సరోజినియిల్లు.

[ప్రవేశము. సరోజని గదిలోఁ గూర్చుండి, యాలోచింపుచు]

(స్వగతము) కటకటా! పదిదినంబులలో వచ్చెద నని, యాతఁ డింకను రాకుండుట కేమి కారణము? నేఁటికి పదుమూఁడు దినము లైనది కదా! రాజకీయాంశములలో లోపము వచ్చుటచేఁ, దురుష్క ప్రభువున కాగ్రహము వచ్చెనా? కాదు, కాదు. నిర్నిద్రస్వభావుండగు నాతఁడు పనులలో లోపంబు లుంపనీయఁడు. గొప్పమూంసముందిను కలకుతురక లెవ్వరైన నాతని కపాయముం గలిగించిరా? మేరుసమానధైర్యసారుండగు నాతనికిఁ దుష్టు లొక్క లెక్కకాదే; మఱి యేమైయుండును? నాపైఁ గోపము జనించెనా? కరుణారసవరుణాలయుండగు నమ్మహానుభావునకుఁ గోపమను నది యొకటి కలదా? నాపని మఱచిపోయియే, రాకయుండెనేమో! అట్లేల చేయును? పిన్ననాటనుండియుఁ దన ప్రాణములలో నొక ప్రాణముగా నెంచు నా ప్రియమిత్రుఁడే నాకార్యము మరచిపోవునా? ఆతని నిర్ణమానము నాకింతైనఁ దెలియకున్నదే! అయ్యయో! నేనేమి చేయఁ గలను? (గవాక్షమునుండి, యాకసమువంకఁ జూచి) ఓ వాయసకులతిలకమా!

ఉ. అక్షయదీక్షతో, దశదిశాంగణముల్ తిరుగాడు నేర్పు ప
త్యక్షము నీకెడన్, ద్విజసంతంసమపోటఁ గటాక్షవీక్షణం

దక్షుఁడవీవు; నిన్ను బహుధా స్తవనం బొనరించి, వేఁడుదున్;
బక్షివరేణ్య, నా ప్రియుని వార్తల నా కెఱుంగఁగఁ జేయవే!

[వామనశాస్త్రి ప్రవేశించును.]

ఈ వృద్ధుఁ డెందునకు నాయొద్దకు వచ్చుచున్నాఁడు? ఈతని నేఁ బెండ్లియాడుదుమనను నాశ యింక నీతని విడువ లేదు కాఁబోలు.

వామ.—ఇక్కడా కూచున్నావు బంగారుపిచికా! నీకోసం యెంత వెతుకుతున్నానే! మెడమీద మేకపిల్లని వేసుకొని ఊరంతా వెతికేడట, గొల్లవాడు; అలాగేఅయిందిలే.

సరో.—నాకోసము మీరు వెదుకవలసిన యవసర మేమి?

వామ.—ఏమిటూ, ఏదో నీదయ సంపాదిద్దామని, మ రేవుంది నువ్వు ఇంతపట్టు పట్టుకొని కూచోవడం యేమైనా బాగుందే? చెప్మా.

సరో.—పట్టువదల కేమున్నది? నా నిశ్చయమును జెప్పివేసితిని.

వామ.—అమ్మో! కాదు, పిల్లా, నీకు నే నేంచేదు మేపుతానా? కాదులే, యెరిక్క అడుగుతాను; పజ్యెండువందల రూపాయీలు మీనాన్నకు ఇచ్చేసేను గదా, నావద్గిర ఇంకా పది వేలరూపాయీలువున్నాయి. నామూడోపెళ్ళాంతాలూకువి, నాలుగో పెళ్ళాంతాలూకువి, రొండువేలరూపాయిల నగలున్నాయి. నీకేమిటి? ఒంటినిండా చీరెకట్టుకొని, మెడ నిండా నగలుపెట్టుకొని, మొగంనిండా పసుపురాసుకొని, నుదుటినిండా కుంకంపెట్టుకొని, సోమిదేవమ్మలాగ నాకళ్ళక వుపిస్తూయుంటే, నాకం తేకావాలి. మ రేవుంది? నీదయ

వుంటే, యింత వండి పెడుదును గాని, లేకుంటే, పోనీ, చూడు, ఏం చూడవేం? పోనీ, వొద్దులే—నేనే యెలాగో యేడుస్తాను. ఏదో, పదో యేటినుంచీ, భర్తపత్నీ సమేతస్య, అని చెప్పుకోడానికి లోపం లేకుండా, వుంటుందని, పోనీకదా అని, ఎంత కర్చులైనా, వొప్పుకున్నాను గానీ, నాకేం రూపాయిలు చేదా? చెప్మా; నామనస్సులోమాట నీతో చెప్పీసేను. ఆమీద నీదయా. నీతోమాటలాడవదాం అంటే, ఎక్కడ నీదర్శనమే దొరికింది కాదు. ఇప్పుడు దొరికింది.

సరో.—(తనలో) ఈపాపాత్ముని ముఖము చూచుటకే నాకు భయమగుచున్నదికదా, ఈతని మాటలకు నే నెట్లు ఉత్తరము చెప్పఁ గలుగుదును? ఆపద్బాంధవుండవగు, నో పరమేశ్వరుండా! ఈదయ్యమును నాకన్నుల యెదుటనుండి తప్పింపవా? (మాటాడకుండును).

[సాగరశాస్త్రి ప్రవేశించును].

సాగ.—వామనశాస్త్రిగారూ! ఇక్కడ నేమి చేయుచున్నారు?

వామ.—ఏమీ లేదు. పెళ్ళికూతుర్ని ప్రేమారు పలకరిద్దామని.

సాగ.—ఏడిచినట్టేయున్నది మీవ్యవహారము. రసాభాసము చేయుదురు కాఁబోలు. మీ రావలకుఁబోయి మీ పనిచూచుకొనుఁడు.

వామ.—సెలవు. (పోవును).

సరో.—(కన్నులువిప్పి) అన్నా! పిశాచముపోయినదే! (ప్రకాశముగా) నాయన్నగారూ! నమస్కారము.

సాగ.—శీఘ్రమేవకళ్యాణసిద్ధిరస్తు.

సరో.—నాయనగారూ! కడసారిమిమ్ముఁ బ్రార్థించుచున్నాను. మీరు నాపై నింత కోపముపూనుటకేమి కారణము? కన్నతండ్రులగు మీరే యింత కఠినత్వము వహింప, ఓనురాలగు నన్నాదరించు వారెవ్వరు?

సాగ.-అమ్మాయీ! నీ వాడిన మాటలు వినుటకు నాకెంతయో విచారముగా నున్నది. బొడ్డుకోసినప్పటినుండియు నెంతయో శ్రమపడి, పన్నెండేండ్లు యీడుదనుక నిన్నుఁబెంచి, పెద్దదానినిజేసి నప్పుడు నీపై లేనికోపము-అన్నప్రాశనమైనదిమొదలుగ నెన్నిచిక్కులనొందియైన, యథాశక్తిగా షడ్రసంబులు సమకూర్చి, ఋంపయినభోజనపదార్థములు తెచ్చి యిచ్చుచున్నప్పుడు నీపై లేనికోపము-మాటలాడుట నేర్చినదియాదిగా నెంతయో యాయాసపడి, ఋజుమార్గమున నిన్నుదిద్దుచు, సత్ప్రవర్తనములోఁ బేరుగన్నదానినిగా జేసినప్పుడు నీపై లేనికోపము-అక్షరాభ్యాస మైనదారంభముగ నెంతయో కష్టపడి, మీతల్లియిష్టానుసారంబుగ సంగీతసాహిత్యంబులు నేర్పి, నిన్నింత విద్వాంసురాలను గాఁ జేసినప్పుడు నీపై లేనికోపము—అట్టికోపము, వివాహవిషయమున మాత్రము కలుగునా? చిన్నతనంబుచే నీమేలు నీవెఱుంగకున్నావు గాని, ధనమువలన గలుగు ప్రయోజనములు నీకు మాత్రము తెలియవా? నామాట నీ విప్పుడలక్ష్యము చేసిన, తరువాత విచారింప వలసివచ్చును సుమా!

సరో.—నాయనగారూ! నాబాల్యమునుండియు, నాకై మీరు

పడిన శ్రమను మఱచి, నేను గృతఘ్నురాల నైనచో, నన్ను మీ రిచ్చుకొనవచ్చినశిక్షకుఁ బాత్రురాలనుగాఁ జేయుఁడు. మీ యందు నాకుఁ గేవలము దైవభావము తప్ప యన్యభావము లేదు. కాని, యభిప్రాయభేదములగు సందేహములలో మొగమోటము నుంచకూడదు. నా కొక్క "సందేహము" బాధించు చున్నది. తమ నిశ్చయమైన యభిప్రాయ మిచ్చెదరా?

సాగ.—తప్పక యిచ్చెదను. నీవడుగఁ బోయినది యరుణాచల శాస్త్రిగారి సంబంధమును గూర్చియేగదా!

సరో.—అవును. ఆసంబంధమువలన మన కేమి నష్టము?

సాగ.—సరే—మోమోటమి విడచి నీవడిగితివి కావున, మోమోటమి విడచి, నేనును జెప్పకతప్పదు. వినుము. అరుణాచలశాస్త్రిగారి సంబంధమువలన మనకెన్నియో నష్టములున్నవి. (1).సమానులతో వియ్యమును, సమానులతో కయ్యమును, నని మనశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. అరుణాచలశాస్త్రిగారు కోటలో గొప్పయుద్యోగమున నున్నారు. వారియొద్ద నాశ్రితులమై మన మున్నాము. మనతో మాట లాడుటయే, యాతనికి లాఘవ మగుచుండ, నాతనితోడి సంబంధము మనకెట్లు శ్రేయమగును? సంబంధము చేసికొనుటవలన సామ్యము కలుగును గదా. అట్టియెడ నాతఁడు నన్ను సమానునివలెనే చూడక, తక్కువచూపు చూచిన, చిన్నతనముకాదా?

సరో-ఆవిషయమైనచింత యవస[illegible] అరుణాచలశాస్త్రి గారు సంపదయందు మనక[illegible]యినను, ఆ

యన కెంతసంపయున్నదో, అంత యపకువ కూడ కలదు. సంబంధము చేసిన తరువాత, నాయన మి మ్మెంతయో మ ర్యాదగఁ జూచును. సంబంధములేనియప్పు డిప్పుడే మిమ్మెం తయో, గౌరవించునుగదా! సంబంధముచేసిన నింక నెంత గౌరవించునో మీరే యాలోచింపుఁడు. ఇంతకును, వియ్య మునందలినావ్యాము బరీక్షింపవలసినవారు మగపెండ్లి వారుకదా. అట్టిచింత వారే పూననిచో, నాడు పెండ్లివా రమగు మనము పూనవలసిన యవసరమేమున్నది?

సాగ.—సరే; అదియట్లుంచుము. (2). ఆప్రభాకరుని సంగతి యాలోచించితివా? నేను గనుపడిన, నాతఁడేదో ధ్యాన ముగా మాటలాడును గాని, సరిగా మాటలే యాడడు. త ప్పదుగదా యని, కనుపడినప్పు డింత చేయిమాత్రమెత్తు ను గాని, మనఃపూర్తిగా నమస్కారమైనను జేయఁడు. అంతగర్వముగలవాని నల్లునిగాఁ జేసికొని నేనేమి సుఖింపఁ గలను?

సరో.—ఆమహానుభావుని ప్రవర్తనంగూర్చి మీరు దురభిప్రా య పడుచున్నారు. గర్వమను పిశాచ మాతని కెన్నియో క్రోసుల దూరముననె యెప్పుడును నిలుచు చుండును గాని, బ్రహ్మవర్చస్సంయుక్తుఁడగు నాతని చెంత నెన్నఁడును జేర లేదు. ఆతఁడు విద్యావ్యాసంగమున నున్నప్పుడు గాని, లేక యాతఁడు పరధ్యా[illegible]న నున్నప్పుడు గాని, మీ రాతని సమీపమున [illegible] యుందురు. అప్పుడును, మీకాతఁ డు నమ[illegible] నని మీ రొప్పు కొనుచునే యు

న్నారు. అంతకన్న, విద్యార్థియగు నాతఁడు మీతో నాడ వలసిన మాటలేమున్నవి? ఆతఁడు స్వతంత్రస్వభావుఁడని నేను నొప్పుకొనెదను గాని, యది గాంభీర్యముతోఁ గూడుకొనిన స్వాతంత్ర్యమే గాని, గర్వముతోఁ గూడినది కాదు. కావున, నా విషయమైన సందేహము మీ కెంతమాత్ర మవసరము లేదు.

సాగ.—తాఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనునట్లు, ఎంత వారించినను, నీవు వానిపైనే మనస్సు నిల్పుదువు కాఁబట్టి వాని లోపములన్నియు, నీకు గుణముల వలెనే కన్పట్టును, ఆవిషయ మింకఁ గట్టిపెట్టి యిది వినుము. (3). వారాగర్భ శ్రీమంతులని నీవు నొప్పుకొనుచున్నావు కదా; వారితో సంబంధము చేసిన, వారు పెద్దవైభవముతో తరలి వత్తురు. అందఱికిని దగినగౌరవములు చేసి, వారినిఁ బెండ్లి యైదు రోజులును భరించుట మన కెంతయో కష్టము. నీ పెండ్లి విషయమై మా తాత సంపాదించిన యారవంత మాన్యము నమ్మి వేయవలసి వచ్చును. ఆతరువాత నేనును ముష్టి యెత్తుకొన వలయును గాని, మరి జీవించు నుపాయము లేదు. దీని కేమందువు?

సరో.—తండ్రీ! ఈకారణము పైఁ జెప్పఁబడిన రెండిటి కన్న దుర్బలతరమైనది. అరుణాచలశాస్త్రిగా రెంతయో యుత్తమపురుషులు. మనస్థితిగతు లాయనకుఁ దెలియును. వైభముతోఁ దరలివచ్చి, మనకు నష్టము కలిగించుట వలన నాయన కేమి లాభము? అందును, ఆయనభార్య సంధ్యాదే

వి యెంతయో మంచియిల్లాలు. దయయన్న, నామెసొమ్ము. కావున, వారు మన బీదతనము ననుసరించియే తరలి వత్తు రు. కొలది పరివారముతో మాత్రము వారు తరలివచ్చు నుద్దేశము కన పరచిన యెడల, వారి సంబంధము నిచ్చ గింతువా?

సాగ.—అసంగతి యాలోచించుట కింకను వ్యవధికలదు. కా ని, మఱియొక కారణము వింటివా! (4). ఆయన ధనాఢ్యుఁ డగుటచే, దేశదేశములవారు తమతమ పిల్లల నిచ్చెద మ ని ఆయనకు కబు రంపి యున్నారు. మొన్న శ్రీకాకుళము లో వెంకుభుక్తగారు ఐమువంద లెదు రిచ్చెదమన్నారు. విజయనగరములో నున్న రామయ్యమ్మగారు వేయినూట పదియారులి చ్చెదమన్నారు. బొబ్బిలోనున్న సీతారామ శాస్త్రులవారంతటి కన్న మిన్నగ, పద్రెండేండ్ల పిల్లనురెం డువేయినూటపదియారు లెదురుతో నిచ్చి, రెండుఖర్చుల ను తామే భరించెద మని బ్రాహ్మణునిచేఁ గబు రంపియు న్నారు. ఆప్రభాకరున కాపిల్లలెవ్వరు నిష్టము లేక పోవుట చే, నా సంబంధములన్నియు వారు విడచివేసినారు.

సరో.—(తనలో) ఆసంబంధములను విడచివేయుటకు వే ఱొ క కారణము కలదు.

సాగ.—మనమే వారిసంబంధము చేయఁ దలఁచిన యెడల, అధమ మైమువంద లైన నియ్య వలయునుగదా; నేనెక్కడ నుండి తేఁగలను.

సరో.—ఇందుస కైయేనా, విచారించుచున్నారు! ఇట్టి వట్టి ని

న్నేతుక మగు విచారము. పై సంబంధములను వారు విడచి వేయుటకు పెండ్లికుమారుని యనిష్టము మొదటి కారణమై యుండ, వరశుల్కము నందలి వారి యనిష్టమే రెండవ కారణము. ఒక్కదమ్మిడీ నైనఁ బుచ్చుకొనమని వారు రూఢిగాఁ జెప్పినచో, వారి సంబంధ మంగీకరింతురా?

సాగ.—(తనలో) అన్నా! దీని యుక్తులకు సమాధానము చెప్ప లేకున్నాను గదా! (ప్రకాశముగా) సరే-ఆవిషయమై యటుండ నిమ్ము. వామనశాస్త్రితో సంబంధము చేయుట వలని లాభములను జూచితివా?

సరే.—తమ యుద్దేశముల నప్పుడే కని విని యున్నాను. అయినను, సెల విండు.

సాగ.—జాగ్రత్తతో విని, సమాధానము చెప్పుము, ఆ యరుణాచలశాస్త్రి తానేమో పెద్ద పండితుఁడనియు, నేను గాననియు నూహించి, కన్యాశుల్క మశాస్త్రీయ మని యుపదేశించుచు, నొక్కదమ్మిడీనైన శుల్కము గ్రహింపఁ గూడ దని యందం దుపన్య సించుచుండును. అట్టివాఁడు మన కేమియు ముట్టఁ జెప్పఁడు కదా? వాని సంబంధము వలన మన కేమి ప్రయోజనము? ఈ వామనశాస్త్రి) పన్నెండువందల రూపాయిలు దవ్వబిళ్ళలలాగున నా చేతులలోఁ బోసినాఁడు. అదిపెట్టి మన చిల్లర యప్పు లన్నియుఁ దీర్చెదను. వానియొద్ద పది పిల్లికూన లున్నవి. అవి పెట్టిన, ఐదువందల రూపాయిల రాఁబడి గల భూములు వచ్చును. అదిగాక, వానిభార్యలతాలూకువి, రెండువేలరూపాయిల

నగలున్నవి. అవి యన్నియు నీ యధీనములే యగును. నీవు వానిఁ బెండ్లియాడినచో, నీ మూలమున నింత యైశ్వర్యము మనకు లభించును. మొన్ననే, వాని తమ్ముని కుమారుఁడు పోమన్న చని పోయినాఁడు. వానితో వానికుటుంబ మంతయు నశించినది. వారసు లెవ్వరును లేకుంటచే మనపై తగాయిదా చేయువాఁడెవ్వఁడును లేఁడు. ధన మంతయును స్వేచ్ఛగా ననుభవింపవచ్చును. దీనికి నీ వేమి చెప్పెదవు?

సరో.—ఈ ప్రశ్నమున కుత్తరము చెప్పుటకు ముందు నే నొక ప్రశ్నము నడిగెదను. దానికి సమాధానమిండు.

సాగ.—అడుగుము.

సరో.—తగినసంబంధము చూచి, కూతులకుఁ బెండ్లి చేయుట వలని సంతోషము కూతులదా? లేక తల్లిదండ్రులదా?

సాగ.—ఆసంబంధమువలనఁ దొలుదొల్త సంతసింప వలసిన వారు కూతులు; కూతులయానందమును జూచి, తల్లిదండ్రు లానందింతురు.

సరో.—సరే,-ఆమాటపై నిలచి, యింక నామాట వినుఁడు. ఈడుజోడగు వరులను వెదకి, తమకూతుల నిచ్చి పెండ్లి చేసినచో, నా కూతులు తమకుఁ దగిన యా భర్తలతోఁ గలసి మెలసి సుఖ పడుచు, పసపు కుంకుమ రాచు కొనుచు, నోములు నోచు కొనుచు, పండుగలకును, పర్వములకును, పుట్టి నింటికిఁ బోవుచు వచ్చుచు, నానందించుచున్న, నట్టి యానందమును జూచి, తమ కూతు లిట్టి సుఖంబులం దేలు చున్నారు కదా యని, తల్లిదండ్రులు కూతులతోఁ బాటు,

తాము బొందు నానందమే నిజమైన యానంద మని నా యల్పజ్ఞానమును బట్టి నే ననుకొను చున్నాను. కాని, మీ యుద్దేశమును బట్టి యాలోచించినచో, కూతులు వితంతువులై, యింటఁజేరి, కేశఖండన మొనరించుకొని, విభూతి పూసికొని, రుద్రాక్షల ధరించి, యొంటి పూట భుజించుచు, పుట్టినింట దాస్యము చేయుచుండ, వారి సమ్మతిచేఁ గలిగిన ధనముతో వడ్డీ వ్యాపారము చేయుచు, రూపాయిలను జేతితో గలగలలాడించుచు, నా సంగీతమున నన్నె మరచు నప్పుడు తల్లిదండ్రులకుఁ గలిగిన యానందమే యానందమని, తేలుచున్నది. లోకానుభవ మించుకంతయైనను లేని నేను, మీబోటి లోకజ్ఞులకుఁ జెప్పఁపాటి దానను కాను. గాని, తండ్రీ! పసుపు కుంకుమ రాచుకొని, భర్తలతోఁ గాపురము చేయుచున్న కూతులం జూచి, తల్లిదండ్రు లానందింతు రని నే ననుకొను చున్నానుగాని, విభూతి, రుద్రాక్షలు ధరించి, పూర్వసువాసినియగు కూతుం జూచి, తల్లిదండ్రు లానందింతు రని నే నిందనుక నెఱుఁగను.

(తెరలో) అమ్మాయీ! అమ్మాయీ!!

సాగ.—మీయమ్మ యెందుకనో పిలుచు చున్నది. పోయిరమ్మా.

సరో.—అమ్మా—వచ్చుచున్నాను. (సరోజిని పోవును.)

సాగ.—(స్వగతము) నేను జేసిన గొప్ప పొరబాటున కిప్పుడు పశ్చాత్తాప పడు చున్నాను.——ఆఁడువాండ్రకు చదువు చెప్పింపఁ గూడ దని పెద్దలు వ్యర్థముగా చెప్పలేదని యిప్పుడు నాకుఁ దెలిసినది. చదువుకొన్నచో, నేదో యింత ‘‘రామ,

కృష్ణ" అని తమకుఁ దోఁచునుపాయము చూచుకొందు రని నేనీమె తల్లిమాటవిని చదువుచెప్పించితిని గాని, యిట్లు కువాదము లలోఁ దిగి, తండ్రి యాజ్ఞను మీరుదు రని యనుకొనలేదు. ఛీ! ఈ యాడువాండ్రకెప్పుడును చదువు చెప్పింపఁ గూడదు. దీనివిషయమైన గ్రంథములు మనభాషలో లేవు. అందఱును స్త్రీవిద్య-స్త్రీవిద్య-అని ఘోషించువారేగాని, స్త్రీవిద్యవలని నష్టములను జూపువారు లేకున్నారు. ఈయంశముపుఁజూర్చి నే నొక ప్రబంధమును వ్రాసి, దానికి వంద ప్రతులుతీయించి, యందఱికిని పంచి పెట్టించెదను. మనదేశమం దిప్పుడిప్పుడే మరల తలయెత్తుచున్న స్త్రీవిద్యాభిమానమును మొదలంటు నశింపఁజేయకున్న, నెంతయో నష్టము వచ్చును. నావంటితండ్రు లింక నెంతమంది యున్నారో, వారికి నేను మార్గదర్శిని కాఁగలను. ధనమువలని ప్రయోజనములను దెలిసికొనలేని యీ నిష్ప్రయోజకుల మాటలు విను టవలన నాకుఁ దలనొప్పి యెత్తుచున్నది. వీరి మాటలను మరి వినను. ఎల్లుండి తెల్లవారు జామున, నాలుగు గంటలకు కుంభ లగ్నమందు ముహూర్తము నిశ్చితము చేసినాను గదా. పెండ్లి జరిగితీరును గాక.

(తెరలో).—

మ. ధనమా, మానవమాన సాపహరణోద్యచ్ఛింతనో న్నిద్రి సా
ధనమా, సౌఖ్య రసాబ్జ సంతపన చింతాపావ కాధార కేం
ధనమా, దుష్పథయాయి వైషయిక సంతానైక తాదాయి బం
ధనమా, మొక్కి సెలవిచ్చి, మాపయి భక్తిద్రాక్షిణ్యముక్తా వీడుమా.

స్థలము 3. అరుణాచలశాస్త్రిగారియిల్లు.

[ప్రవేశము. జబ్బుగానున్న యరుణాచలశాస్త్రి మంచముపైఁ బరుండుకొని, భార్య-సంధ్యాదేవి పాదము లొత్తును].

సంధ్యా.—ప్రాణేశ్వరా! మీ రదేపనిగా విచారించుచున్నారో, మీజ్వరము మరింత హెచ్చుకాదా? ఇంతకును, ఇప్పుడు వచ్చిన యాపద యేమి? పదునైదురోజులైనను, అబ్బాయి మరలి రాకుండుటయే కదా, మీ విచారమునకుఁ గారణము? రాజకీయాంశములం గూర్చి పోయినవారు వెంటనే మరలి రాఁగలరా? ఐశ్వర్యమత్తుఁడగు నవాబు దర్శనము దొరికెనో లేదో, గుప్తదానలోలురగు గుమాస్తాలు లెక్కలను బహిష్కరించుట యైనదో లేదో, అనురాగసంయుక్తులగు బంధువులే నాలుగురోజు లాపియుంచిరో, కారణము తెలియక మన మిట్లు విచారించుట మంచిపనియా?

అరు.—కాంతా! నీవు చెప్పిన దంతయును నిజమే కాని, నా యంతరాత్మ మాత్రము నన్ను వేధింపుచున్నది. అబ్బాయికి నేదియో యాపద వాటిల్లెనని గుండియ యను డప్పుపైఁ జాటి చెప్పుచున్నది. నేనెన్నఁడైన నిట్లు విచారించితినా? అయ్యయో! రాజకీయవ్యవహారములను జక్కఁ బెట్టుకొన వలసిన యీరోజులలోనే, భగవంతుఁడు నాకీ జబ్బు తెచ్చి పెట్టవలెనా? ఏమి నా దురదృష్టము? నాకీ జ్వరము రాకయే యున్న యెడల, కనుమరపని నా పసికూనను బంపక నేనేపోయి నాపని నెరవేర్చుకొందును గదా, ఓభగవంతుఁడా! నీకు నే నేమి యపకార మొనర్చితిని?

సంధ్యా.—(తనలో) నా మనోనాథుఁడు చెప్పినట్లు నిజముగ నా మనస్సాక్షియు, నబ్బాయికి నేదో యాపద కల్గెనని యే చెప్పుచున్నది. కాని, నేనే యధైర్య పడినచో జ్వరపీడితుఁడై యున్న నా ప్రాణేశ్వరున కింక ధైర్యము చెప్పువారెవ్వరు? (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! కారణ మారయక యే మన మిట్లు విచారించిన, నేమి లాభము? మనము పంపిన సేవకుఁ డీదినమునకు రావలయును గదా. అతఁడు వచ్చి జరిగిన సమాచారము చెప్పనే చెప్పును. అప్పుడు పోలిన తెరంగాలోచింప వచ్చును గాని, యిప్పుడే యేల విచారింప వలెను?

[సేవకుఁడు ప్రవేశించును].

ఇదిగో! మాటలోనే వచ్చితివి. సేవకా! నీవు నూరేండ్లాయువు సుమా, శ్రీకాకుళమునకు పోయితివా?

సేవ.—పోయితిని.

సంధ్యా.—అబ్బాయిని చూచితివా?

సేవ.—లేదు.

సంధ్యా.—ఏల?

సేవ.—వా... ...రు... ...అమ్మా. వా...రు...(నసుగును)

సంధ్యా.—చెప్పుము. భయమేమి?

సేవ.—అమ్మా, ఖై ... ... ...దు ... ... ... ...

సంధ్యా.—ఖైదులో నుంచఁ బడెనా యేమి?

సేవ.—అవును. అట్లే చెప్పుకొనుచున్నారు.

సంధ్యా.—(తనలో) కటకటా! మనస్సాక్షియబద్ధమాడదుగదా.

అను.—ఏమీ—నాకుమారుఁడా—ఖైదులోనా—పడెనా—ఏల—ఎప్పుడు—ఎక్కడ—అంతసాహసమెవ్వనికి కలిగెను? (నడిపడి లేచి నిలువబడెను) ఛీ! నే నెంత దుర్మార్గుఁడను? (మూర్ఛ నొందును). (సంధ్యాదేవి శైత్యోపచారములుచేసిన, తెప్పిరిల్లును).

సంధ్యా.—అయ్యయ్యో! నా బ్రదు కెంత దుస్థితికి వచ్చెను; ముందునకు మహాసముద్రమును, వెనుకకు కాలాగ్నియు నయ్యనే! ఛీ! నాయంత పాపాత్మురాలి లోకమునఁ గలదా?

అను.—ప్రాణేశ్వరీ! నన్ను విడువుము. నే నీ క్షణముననే శ్రీకాకుళమునకుఁ బోయి, నవాబుగారి దర్శనము చేసి, వానిని ఖైదులో నుంచుటకుఁ గారణము తెలిసికొని, వాని నెట్లయిన విడిపించి తెచ్చెదను, వాఁడు మనఃపూర్వకముగా నేరమేదియుఁ జేయువాఁడు కాఁడని నాకుఁ దెలియును. దుర్మార్గులగు తురుష్కులు వానికృత్యములను దురభిప్రాయ పడి యుందురు, నన్ను విడువుము. నేఁ బోయెదను.

సంధ్యా.—(వానిని పట్టుకొని పరుండఁ బెట్టి) ప్రాణేశ్వరా! ఈ సేవకుని మాట లెంత వరకు సత్యములో ముందు తెలిసికొనకుండ, మనము విచారించిన లాభ మేమి? ఒకవేళ సత్యమే యయినను, ఇట్టి స్వల్పకార్యమునకు మీరు స్వయముగాఁ బోవలయునా? ఈ దినముననే మనప్రభువులయొద్దకు మీపేరున నేను లేఖ వ్రాసి, యేవిధముననైన కుమారుని దెచ్చి మాకప్పగింప వలసినదని కబు రంపెదను. మన యందెంతయో యాదరణమును జూపుచున్న మనప్రభువులు

మనసని శ్రద్ధ చేయకు. బాహ్యాంతర్జ్వరంబులచేఁ గడు నలసియున్నాడు. ఇంచుక విశ్రమింపుఁడు. నేను నాపని చూచుకొనెదను. (లేచి కొంచెము ముందునకు వచ్చిన, వెనుక తెరజారును.) (స్వగతము) దైవమా, నాకెట్టి యవస్థం దెచ్చితివి? ముందునకుంబోవ మహాసముద్రమును, వెనుకకు బోవ కాలాగ్నియుఁ గన్పట్టుచున్నవే! అయ్యయో! నేనేమి చేయుదును.

ఉ. ఎన్నిదినంబు లయ్యె, హృద◆యేశున కీజ్వర మంకురించి, యే
నెన్నివిధంబులన్ శ్రమస◆హించినయేని యుఁ దగ్గదయ్యెఁ; దా
నన్నము ముట్టడింతయును, ◆ నాకలి యయ్యె ననండు; కొంచమేన్
గన్నులు మూసి నిద్దుర క◆నండు; వినండు మదీయ వాక్యముల్.

చ. పలుకఁగ లేఁడొకింత యును, ◆ బల్కిన వేళఁ బరాకు మాటలే
పలుకుచు నుండుగాని, తన ◆ బాధలఁ గొంచెము నైనఁ దెల్పఁగాఁ
దలఁపఁడు, వందఁజేయును గ◆దా యది నన్నని, జాలిమాటలన్
గలఁగఁగ నీయఁడా జ్వరము ◆ కల్గినవేళల, నామచిత్తమున్.

నాప్రాణేశ్వరుఁడు నామనమునకు విచారము కలుగనీయకుండుటకై తనబాధలను నాకుఁ దెలియనీయక యెంత దాఁపఁబోయినను, దాఁపవలనైన వస్తువైనఁ గదా, దాఁపనగును.

సీ. తనువుపైఁ జేయివై◆చిన, నగ్నిహోత్రంబు
వలెఁ గాగుచుండుటం ◆ దెలియరాదె?
చేతి వక్షమ్ముపైఁ ◆ జేయివైచిన గుండె
యలుకొట్టుకొనుటచేఁ ◆ దెలియరాదె?
చెంత నిల్చిన యప్పు◆డింతేని నిడుదయూ
ర్పులు గల్గుచుండుటం ◆ దెలియరాదె?

ప్రక్కఁగూర్చుండి పరిహాస మాటాడుట
　　పలుమారు వినుటచేఁ దెలియరాదె?

గీ. చిత్తనాథుండు నాపైని హత్తుకొనిన
తన యనూనానురాగంబుఁ దలఁచి తలఁచి,
తనదు బాధల దాపంగఁ దలఁచుఁగాని,
దాపనెంచిన నయ్యది దాపఁబడునె?

హృదయేశ్వరుని జ్వరబాధకై యే నేనెంతయో వంత నొందుచుండ, గోరుచుట్టుపై రోకటిపోటనునట్లు, కుమారునకీ ప్రయాణమేలవచ్చెను? ఏలవచ్చెననసేల? లోకములోఁ దండ్రిపని చక్కఁజేయుటకు జ్ఞానమువచ్చిన కుమారులు పోవుట సహజమే. అట్లే నాకుమారుఁడును పోయెను. ఇందేమియును లోకవిరుద్ధము లేదు; గాని, కటకటా! రోకలిపోటుతగిలిన గోరుచుట్టుపై తేలుపోటు తగిలినట్లు, రాజకార్యార్థమైపోయిన నాకుమారుఁడు ఖైదులోపడుటయేల? వెఱిగియెఱిగి యాతఁ డెవ్వరికినెగ్గుచేయవలసిన వాఁడుకాఁడే.

సీ. పరసదనమ్ములోఁ బలుకాడి యెవని చి
　　త్తము నైన నొప్పింపఁ దలఁప బోఁడు;
తనకు నక్కఱలేని పనులలోపలఁ జొచ్చి
　　పెఱల కాగ్రహము కల్పింపఁ బోఁడు;
అన్నదమ్ములయట్టు లందఱిం గనుఁగాని,
　　యొకరితో వైరమ్ము నొందఁ బోఁడు;
పరకాంతయన్న సోదరి యట్లు భావించుఁ
　　గాని, దుర్బుద్ధితోఁ గాంచఁ బోఁడు;
గీ. అంతరాత్మయె తోడుగా నన్ని పనులు,
చేయుచుండును గాని, యే హాయనైన,

నితరు లెందఱు తనుఁ ద్రిప్ప ♦ నెంచుచున్నఁ,
బోవ నొల్లఁడు చెడ్డయౌ ♦ త్రోవ యందు.

సీ. పెద్దవారలఁ గాంచి, ♦ బద్ధులౌమాటఁ
గల నైనఁ బలుకంగఁ ♦ దలఁపఁ బోఁడు;
అధికార మింతయు ♦ న్నది గదా యని యెంచి,
క్రిందివారల నేవ ♦ గింపఁ బోఁడు;
అన్నమ్మునకు లోప ♦ మను మాట లేదని,
పనిబాటు లేక ని ♦ ల్వంగఁ బోఁడు;
వినయమ్ముతో నెంతొ ♦ విద్దె నేర్చును గాని,
యిసుమంత గరువమ్ము ♦ నెనయఁ బోఁడు;

గీ. ప్రభులఁ గనుఁగొన్న యంత నే ♦ వారి కెట్లు,
కరుణ గల్గునో, యమ్మాడ్కి ♦ నరసి, దాని,
నార్జవపథంబుతోఁ గూర్చి. ♦ యట్లు పలికి,
పనులుకొను గాని, తొందర ♦ పడఁగఁ బోఁడు.

అట్టి గుణవంతుఁ డయ్యు నా కుమారుఁ డిట్టి యాపదలోఁ బడి పోవుట యెంత వింతగా నున్నది. అమ్మా, రాజరాజేశ్వరీ! నీకింత కరుణ లేక పోవుట కేమి కారణము ?

శా. ఘోరార్తిం బడఁ ద్రోసి, నాదువిభునిం ♦ గుందించుటే, న్యాయమా?
కారాగారము నందుఁ ద్రోసి, సుతునిం ♦ గారించుటే, న్యాయమా?
పారంబుం గనలేని వంత నిడి నన్ ♦ బాధించుటే, న్యాయమా?
యేరీతిన్ బ్రదుకంగ నేర్తు నిఁకఁ ద ♦ ల్లీ, రాజరాజేశ్వరీ!

## స్థలము 4. రోడ్డు.

[ప్రవేశము. వామనశాస్త్రి కుంటుచు,]

(స్వగతము) అన్నా! బ్రదుకు జీవుఁడా! ఇప్పుడు గదా, నా

రొాట్టె నేతిలో పడ్డాది. గుంట గాడిదకొడుక్కి అంత పోయికాల మేమి? ఇగ చావమను. ఎలాచస్తాడో. (కూర్చుండఁబడును). కాకపోతేనట! కళ్ళు మీాదికొచ్చేయి వెధవకిగుడ్లు పిదిమించేదును. (దాసిప్రవేశించును).

దాసి.-ఏటిబాబు? ఏటిబాబు? మూకుళాలుగున్నావు. సెప్పవా?

వామ.—అబ్బా,-ఉండే, ఇప్పుడు మరి మాటాడించకే,

దాసి.—ఏటి ఆనాగంతావు బాబు? ఒకనాటిదాన్నా? ఎప్పటికీ ఉండీదాన్నేగానా? సెప్పవా?

వామ.-మరేమిటి చెప్పడవేఁ? నారొాట్టెనేతిలోపడ్డాదిఇన్నాళ్లకి.

దాసి.—ఏటిబాబు? రొాట్టేటి బాబు? నెయ్యేటిబాబు? పడడమేటి బాబు?

వామ.—పడడ మేమిఁటే? ఇంకా అడుగుతావు? పుంజు చచ్చిపోయింది.

దాసి.-అదేటి బాబూ? ఒడ్డేన్ని సెప్తావు? తెనుగున సెప్పరాదా?

వామ.—ఒడ్డేమేమిటే? నిపిండం? నాపిండం. ఆగాడిదకొడుకు చచ్చిపోయినాడు.

దాసి.—ఎపుడు బాబు సచ్చిపోనాడు? రామ రామ! ఆలమ్మ ఎంతేడుస్తాదో!

వామ.—నువ్వేన్ని అడుగుతావు. ఎవడేమిఁటి? ప్రభాకరుఁడు.

దాసి.—నిబ్బగేనుబాబూ! నిబ్బగేనా? పెబ్బయ్యబాబే! సచ్చిపోవటమే?

వామ.—నిజమేనే. ప్రభాకరుడేనే.

దాసి.—సచ్చిపోనేదట బాబూ, ఖైదులొాడ్డాడట.

వామ.—అవ్వ పేరే ముసలమ్మ. అలా అన లేక ఇలా అన్నాను. అంతే, మరేమీ లేదు.

దాసి.—పోనీ బాబు. నీ పని ఒగ్గిపోయింది. అయితే బాబూ! మాపిటికి ముహూర్తం పట్టం నిజమేనా?

వామ.—ముహూర్తం ఏమిటి? నీ యిల్లు వల్ల కాడు గాను. ముహూర్తం కాదు. లగ్గం. ముహూర్తానికి ఇంకా కొన్నాళ్లు పోవాలి.

దాసి.—పోనీ బాబూ, నాకు మా చంతోసం. బాబు. అమ్మన్న గారికి బాగా ముస్తాబు సేస్తాను. పోతాను. దయయుంచుమా. (పోవును).

వామ.—కావాలి, గాడిదకొడుక్కి. అంత కళ్ళు నెత్తిమీదికి రావడమేమి. రెండు వెయ్యిచ్చాటపదార్లు ఎదురిస్తానన్న పిల్లను మానీడమేమి? పన్నెండునందలు పోసి నేను కొనుక్కున్న పిల్లనే పెళ్ళాడతానని నిశ్చయం చేసుకోవడమేమి? ఇగ రమ్మను. ఎలా వొచ్చి పెళ్ళాడతాడో, ఆనారాయణమూర్తి లేడూ? మంచీ చెడ్డా చూడడానికి? గుంటలంజ—ఎట్టిగా బుట్టిగా వున్నాడని, వాడి మీద కన్నేసిందోయి. ఇగ వెయ్యమను. ఎవడి మీద వేస్తుందో, ఉండు. ఉండు. ఆ రవంత పుస్తెముడి పడనీ. దాని గడ్డి దాన్ని తినిపిస్తాను. నన్నింత అల్లరి చేస్తుందేం? (తెరలో కలకలము) అదిగో! విడిదిలో అలికిరి అవుతున్నాది. పెళ్ళి ప్రయత్నాలు మా జోరుగా వున్నాయి. నేను వెళ్తాను. (పోవును).

సందర్భ ప్రలాపములను జేయు చున్నాను? ప్రాణమిత్రుల కాపద కలిగి నప్పుడు దాని నుండి తప్పించు ప్రయత్నము చేయ వలయును గాని, యిట్లధైర్య పడుట తగునా? ఓ ప్రభాకరా! నీ కిట్టి యాపత్తు కల్గినదని విచారింపకుము. చిన్నతనంబు నుండియును ప్రాణములన్నియు నీకే యర్పణ చేసిన నీ సరోజిని యింక ప్రాణమ్ములతో నున్నది సుమా. అది యేరీతి నైన నిన్ను జెఱనుండి విముక్తి చేయించి, నీ కేలు వట్టుటకై ప్రయత్నించునని నమ్ముమా. అట్టి సుకుమారశరీరుని చెఱను ద్రోసిన యా దుర్మార్గులకు నాతని ప్రాణేశ్వరి సరోజిని జీవముతో నున్న మాట తెలియదు కాఁబోలు. నేను జన్మమున బ్రాహ్మణ స్త్రీనఁట. గొంచెమో, గొప్పయో చదువు కొన్నానఁట. నా ప్రాణేశ్వరుని రక్షించుకొను నుపాయము వెదకు కొనలేనఁట! నా సామర్థ్యముం జూపుట కింతకన్న నేది తరుణము? ఓ తండ్రీ! కీడు మేలునకే వచ్చునని పెద్దలు నిజముగానే చెప్పినారు సుమా. నేటిరాత్రియే నీవు వివాహ ముహూర్తము నిహితము చేయకున్న, నాకింతటి తెంపు కలిగి యుండదు. నా ప్రాణేశ్వరునకు సహాయము చేయుటయు నుండదు. (ఆలోచించి, లేచి నిలచి) ఓ ప్రాణేశ్వరా! శిరీషకుసుమపేశలాంగుడవు. నీవు కారాగృహము నందలి యిక్కట్టుల నెట్టుల భరించు చున్నావో కదా!

సీ. చివురు జొంపములట్లు ♦ చెలఁగు నీ చేతులం
గరకురాలను మోయఁ ♦ గలవె నాథ!
తమ్మిపూవుల మేలి ♦ తళుకొందు కాళ్ళతోఁ
గరకు నేలలఁ బోవఁ ♦ గలవె నాథ!

లలిత శంఖవిలాస • ముల నొప్పు కంఠానఁ
　　గరకు పూఁజును వేయఁ • గలవె నాథ!
మధురసోపేత భో • జనము చేసెడు నోటఁ
　　గరకుటంబలి ద్రాగఁ • గలవె నాథ!

గీ. మనసు నొచ్చెడు వేళల • నను దలంచి,
యెంత వంతను బొందెదో • యెఱుఁగ నైతి;
నీదు నెచ్చెలి జీవమ్మె • తోఁ దలిర్ప,
నీకు సుఖ మింత యైనను • లేకపోయె.

అయ్యయో! తగిన యుపాయ మాలోచింపక, వ్యర్థముగ నిట్లు కాలయాపన చేసినచో, కార్యము సఫల మగునా? (మరల నాలోచించి,) సరే-మంచియుపాయము తోఁచినది. ఇప్పు డెంత వేళ యైనది? (ఆకసమువంకఁ జూచి,) ఎనిమిది గంటల రాత్రి యైనది. లగ్నము తెల్లవారు వేళ నాలుగు గంటలుకదా. ఉదయలగ్న మగుటచే మొదలి జామునసే కొన్నిపనులఁ జేసికొని, రెండవ మూఁడవ జాముల యందు ఇంటి వారందఱును గాఢ నిద్రలో నుందురు. అంతియేకాక, పెండ్లివారగుటచే నెవ్వరును పూచీతో నుండక, యెవరి యవస్థను వారే చూచుకొందురు. కావున, మూఁడుగంటలుకొట్టువరకును నన్ను బరీక్షించు వారెవ్వరును నుండరు. అప్పుడు నాయిచ్చకు వచ్చిన పని చేయవచ్చును.

[తానుఁ బెంచిన పక్షుల నుద్దేశింపుచు],

సీ. ముద్దు పల్కులతోడ • మురిపెమిచ్చిన చిల్క
　　పోలతులారా! నాపై • నెఱవు నిండు,

ఇంపు పద్దెముల నే ♦ నిచ్చిన గోరువంక,
గోరువంకలారా! నాకు ♦ సెలవు నిండు
అందమౌ నడల నా ♦ నంద మిచ్చిన యంచ
చెలియలారా! నాకు ♦ సెలవు నిండు;
ఎంచి, పాటల్కి మోద ♦ మిచ్చిన కోయిల
కలికిలారా! నాకు ♦ సెలవు నిండు;

గీ. సంగ దోషంబుచేత ని ♦ స్సంశయముగ,
మిమ్ము విడనాడ నాదు డెం ♦ దమ్ము కుందు;
నింక మీ పను నా పను ♦ ఋణము తీరె,
చెలిమి నెంచుచు నుండుడు ♦ సెలవు నిండు.

కీడెంచి మేలెంచ వలయునని పెద్దలు చెప్పుదురు. దరిద్రుల కతి స్నేహితురాలగు నిద్రాదేవివచ్చి నాపని యాటంక పరచునేమో! ఓ నిద్రాదేవి!

ఉ. అన్నను గూడి, కాననము ♦ లందుఁ జరింపఁగఁ బోయినట్టి యా
సన్నుత చర్య, లక్ష్మణుని ♦ చాయను బాసి, చతుర్దశాబ్దముల్
మన్నన చూపఁ జాలితివి ♦ లాతిని కావని, నీ మనమ్మునన్
నన్నుఁ దలంచి, దూరముగ ♦ నాలుఁగు గంటలు పోసి యుండుమీ.

(పండుకొనును. తెరజారును).

---

స్థలము 6. సరోజినియిల్లు.

[ప్రవేశము నాగరశాస్త్రి, సంభ్రమముతో]

నే నొక్కఁడను. ఎంతని కొట్టుకొందును? ఎవరి మట్టుకు వారే నిద్రపోవుచు, నాగపల్లి లీఁడిన మునునాటి లాగున నిట్లు

పండుకొనియున్నఁ బను లెట్లు జరుగునో! ఆ పురోహితుఁ డింక ను రాలేదు. వంటవారింకను రాలేదు. (తెరలో మూఁడుగం టలు కొట్టఁబడును) అదిగో, మూఁడుగంటలైపోయినది. సమ ముగా మూఁడుగంటలకు విడిది నుండివచ్చెదనని వామనశాస్త్రి అన్నాఁడు. వారిని తోడ్కొని వచ్చుటకు అరగంటక్రిందటనే మా యన్నగారిని బంపి యున్నాను. వారు వచ్చువేళ యైనది. ఇక్కడి ప్రయత్నములేవియును బూర్తి కాలేదు. (తెరలో మంగళవాద్యములు వినబడును). దాసీ-దాసీ-ఓదాసీ- ఓదాసీ దాసీ, (దాసివచ్చును). అమ్మాయిని లేపు. వేగము, వేగమూ. పెళ్ళివారు వచ్చినారు. వేగము-వేగము-వెళ్ళవేమి? నేను పో యి పెళ్ళివారిని మర్యాద చేసి తెచ్చెదను. (పోవును).

దాసి.—ఇప్పుడే సేపి పట్టుకొస్తాను, బాబూ. (పోవును).



స్థలము 7. సరోజినిగది.

[దాసి ప్రవేశించి, మంచమునకు కొంచెము దూరముగా నిలచి గట్టిగా]

అమ్మన్నగారూ! అమ్మన్నగారూ!! సరోసినమ్మగారూ, అ మ్మన్నగారు, అమ్మన్నగారు – ఏటీ మొద్దునిద్దర? యెప్పటికీ నె గదు! పెళ్ళికూతురుగారు,-పెళ్ళికూతురుగారు,-సరోసినమ్మగారు సరోసినమ్మగారు, అమ్మన్నగారు, అమ్మన్నగారు, అబ్బా, గొంతు క యెలుగు రాసిపోనాది. ఎంతని పిలను? యేటమ్మా, యిచ్చిం తరం! పెళ్ళి ఆరురోజులనిద్దర యీయేలే తీసేగూలా, ఆయెనక కావలిస్తే ఫొూరంరోజులు తొంగో కూడదా! పెళ్ళోరు ఒస్తి

నాను. డమడమతా సామర్ధ్యాలు వ్రాగుతుంటే, యింకా నిద్ర శా-టకొట్టినాది కాబోలురా-దైబమా-నానూ ఎత్తు ఎత్తు తాను. అమ్మన్నగారూ,-అమ్మన్నగారూ,-వ్రామనసేత్తుల్లుగారు పిలస్తున్నారు. నెగు నెగు. (అపవారించినట్లు నటించి) ఇద-ఇద నాను సేపుతాను ఉండవయ్యా-నువ్వేటి తొందర పడతావు? ఏటిబాబూ, యీనిద్దర? కుంబకర్ణుడి నిద్దర నాగున్నాది. (మంచము తెరలాగును.) అమ్మన్నగారూ,-అమ్మన్నగారూ,- (దుప్పటిపైకి తీసివేయును) అమ్మన్నగారూ, అమ్మన్నగారూ (తడవును) ఏటిది? పెద్ద తలగడా-ఏటి-ఏకీ-అదే-అదే-అయ్యో-అయ్యో అమ్మా-అమ్మా-బాబూ-బాబూ-నాయనా-నాయనా- (పెద్ద గొంతుకతో నేడ్చును) (పెళ్ళివారందరును వచ్చి గడబిడగా నరతురు).

(పద్మలత (ప్రవేశించి) ఏమే-ఏమే-దాసీ-దాసీ-ఏమిటే ఏమిటే-ఏడ్పు ఎందుకే-చెప్పవే-చెప్పవే- చెప్పవేమే- చెప్పవేమే.—

దాసి.—సూడమ్మా-యేటి అనుగుతావు-సూడమ్మా. (మంచము చూపుచు, ఏడ్చును).

పద్మ.—చెప్పవే-ఏమి జరిగినదో చెప్పవే-చెప్పవే-చెప్పవే.

దాసి.—నురేటి సెప్పడమమ్మా-ఇక్కడ సూడమ్మ-బంగారు పిసికేడమ్మా.

పద్మ.—అయ్యో-అయ్యో ఎక్కడకు పోయినదే-ఎక్కడకు పోయినదే-అదేమిటే-ఆ కనుపించుచున్నది?

దాసి.—పెద్దతలగడా అమ్మా—పెద్దతలగడ అమ్మా.

పద్మ.—(చతికిలబడి కూర్చుండి) అయ్యో-అయ్యో-నేనేమి చే
యుదునమ్మా.

(సాగరశాస్త్రి ప్రవేశించును). ఏమిటిరా- ఏమిటిరా-ఏమిటిరా-ఏడుపులు ఏమిటిరా-మొత్తుకొనుట ఏమిటిరా-చెప్పరురా-చెప్పరురా.

దాసి.—మరేటి సెప్పడం బాబూ, పిసికెగిరిపోయింది బాబూ.

సాగ.—అమ్మాయి చనిపోయెనా యేమి?

దాసి—సచ్చనేదు బాబు. ఎక్కడకో యెలిపోయింది.

సాగ.—మీరు వట్టి తెలివితక్కువ కేకలు వేయుచున్నారు. ఎక్కడికిపోవును? నేను వెదకెదను. (మంచము తడవును. తలగడా పట్టుకొని) ఇదియేమి? పెద్ద తలగడా. ఏమినిజముగానే పోయెనా? ఆఁ ఎక్కడికిపోవును? ఒరీ రామిగా-అచ్చిగా, మీరు పోయి పెరటిలోను, వీధిలోను చూచి రండు.

[పురోహితుడును, వామనశాస్త్రియును వత్తురు].

పురో.—శుభముహూర్తం మించిపోవుచున్నది. పెళ్ళికూతురును తీసికొని రారేమి? యింకను వేళ కాలేదనుకొనుచున్నారా యేమి?

సాగ.—ఉండవయ్యా, నీ ముహూర్తం బంగారం కాను. పెళ్లికూతురెక్కడను కనుపడకున్నది.

వామ.—మామగారూ,-ఏవిఁటి, ఏవిఁటి? విరళంగా చెప్పండీ!

సాగ.—విరళమేమిటయ్యా-ఇంకను విరళము సరళము అనుచున్నావు. కొంప మునుగుచున్నది.

వామ.—దాసీ,-ఏమిటి జరిగిందో నువ్వైనా చెపుదూ.

దాసి.—మ రేటి బాబూ, అమ్మన్నగా రెక్కడా కనపడరు బాబు. పారిపోనారు కావాల.

వామ.—ఎక్కడికి పారిపోతుంది? పెరట్లోకి పోయిందో, ఘేవిఁటో, ఒట్టినే ఎందుకు అల్లర పడతారు? తాపీ చెయ్యండి-అదేమిటి-ఆకనిపిస్తూవుఁది? (తడవును). ఇది తలగడా—అయ్యో-నిజమేనా యేవిఁటి? (మరల తడవును) ఇదేవిఁటి కాగితం లాగుంది, (తీయును). కవరుత్తరం లాఁగుంది. మాఁవఁగారూ! ఏవిఁటో చూడండీ! (ఇచ్చును).

సాగ.—దాసీ ఆదీపముదగ్గరకు తీసికొనిరా. (తెచ్చును) ఇది నాపై విలాసముతో నున్నది. (చింపును). నాయనగారూ! (సగముచదివి) దాని దస్తూరీవలెనే యున్నది. నాయనగారూ! మీరు నాకై పరితపింప వలదు. నేను నూతిలోగాని, గోతిలోగాని, పడిపోయితి ననుకొనవలదు. నే నేదో కారణమున నెక్కడికో పోవుచున్నాను. నాకై వెదకవద్దు. వెదకినను నేను దొరకను. కాని, మీరింక బుద్ధి నేర్చుకొనుఁడు. చిన్నపిల్లను ముసలిపెండ్లికొడుకులకుఁ గట్టిపెట్టవలదనియు, కట్టిపెట్టనెంచిన, నిట్టినష్టములే కలుగుననియు, మీయనుభవమువలన నేడు మీకు కలిగిన జ్ఞానబీజములను లోకమునందు వెదఁజల్లుఁడు. వానిని వృద్ధి చేయుఁడు. నాకై యేంతయో వంత నొందు మాయమ్మ నూరార్పుఁడు. నాకు పెళ్లవాసంగుఁడు.

ఇట్లు మీయనుంగు కూఁతురు.

సరోజిని.

సౌగ.—అయ్యయ్యో, పిల్లా - ఎంతపని చేసితివి? ఈ మాట నాతో మొదటనే చెప్పిన, నేనీపెండ్లి మానివేయుదునే. ఇంత పని చేసెదవని తెలిసినదికాదే. అయ్యో! కూతురా!!

హాను.—(తనలో) పన్నెండువందలు పోసినా, నాకీగతేవొచ్చిం దేమిరా, దేవుఁడా! నా రూపాయిలు మళ్ళీ యిస్తాడురా, యీ పీనుగ్గొట్టుగాడిదకొడుకు? అయ్యో నారూపాయిలా?

(పద్మలత తప్ప తక్కిన యందరును నిష్క్రమింతురు).

పద్మ.—అయ్యయ్యో! ముద్దుకూతురా! ఎంతపని చేసితివి?

సీ. ఎక్కడఁ జేని యంట్టీ కంటెగ్రుడ్డి
మగఁడేల వచ్చెనే, ♦ కన్నబిడ్డ;
కన్నబిడ్డలకన్న, ♦ పన్నెండు వందలే
పావనంబయ్యెనే ♦ పాలపాప;
పాలపాపవు నీవు ♦ పారిపోయితివేమొ,
యెందు వెదకింతువే ♦ కందుకూన;
కందుకూనవు నింత ♦ గట్టిదనమ్మెల,
జాలి లేకుండెనే, ♦ చక్కనమ్మ;

గీ. చక్కనమ్మరో, నన్నింత ♦ దిక్కులేని,
పక్కఁ జేసిలి వీరితెఁ ♦ జిక్కులొంది,
యిక్కటీరంబునందు ♦ నే నెక్కరణిని,
దక్కియుండుదు నెమ్మేన, ♦ నక్కటకట!

సీ. నిండుచందురుఁ గేరు ♦ నీముద్దుమోమున,
నెవరు బొట్టిడుదురో, ♦ యింకమీఁద;
విరిసిన బారకై ♦ వ్రేలాడు నీ కొప్పు
నెవరు దువ్వుదురో కో ♦ యింకమీఁద;

నల్లకల్వలు! సోరు నవ్వు ♦ నీ కనుదోయి,
ఎవరు కాటుక యుంతు ♦ రింక మీఁదఁ;
బంగారుతీఁగె నా ♦ బంగారు నీ మేను,
ఎవరు నగల్నింతు ♦ రింక మీఁద;
గీ. దిక్కుమొగ్గియు నీవిట్లు ♦ దిక్కు లేని,
దానవై యుండఁగోరుట ♦ దగునె నీకు;
నాఁడుకోడ్తవు నీవెంట ♦ నరిగియుంటి
వెట్లు జీవింపనేర్తునో ♦ యింక మీఁద.
సీ. వేళదాటిన నింత ♦ తాళలేవక్కటా!
ఆకలి! యెట్లోర్తు ♦ వమ్మ నీవు;
ననుఁ బాసి నిముసమై ♦ నను నిల్వవక్కటా!
పెరచోట్ల నెట్లుండు ♦ దిట్ట నీవు;
పొరుగింటికైనను ♦ బోవెన్నఁడక్కటా!
యొంటిమై నెమ్మెయి నిల్చి ♦ యుందువీవు?
అరకోసు దవ్వైన ♦ నరుగలేవక్కటా!
నలుకలంకుల నెట్లు ♦ నడతువీవు?
గీ. నాకుఁ జెప్పకపోవుటో ♦ నే కుమారి;
లేక లేకయె నిను గంటి ♦ నే కుమారి;
నీకు నేనింత బరువైతి ♦ నే కుమారి;
రాక నీ కెట్లు మనసొప్పె ♦ నే కుమారి?

(తెరజారును).

—⁂—

# చతుర్థాంకము.

## స్థలము 1. కారాగృహము.

[ప్రవేశము ప్రభాకరుఁడు. స్వగతము.]

దైవమా! తుదకిట్టిరా తుదిక బాస యనునట్లు, తుదకు నాకీగతియా తెచ్చితివి? ఓకుముదినీ! ఆకాశమును, భూమియును సాక్షిగఁ బెండ్లియాడినవాఁడే, దైవమని యెంచువారును, కష్టసుఖములు, శీతోష్ణములు, మున్నగు ద్వంద్వముల నేకభావముతోఁ జూచువారును, నగు హైందవతరుణీమండలమును చంద్రమండలమున స్థూలదృష్టిగోచరమగు కళంకము చందంబున నొప్పునది యొక్క చిత్రాంగియే యనుకొనుచుండ, సూక్ష్మగ్రాహక సాహాయ్యమవసరము లేకయే, నీరూపముధరించి, మఱియొక కళంకముకూడఁ గన్పట్టినయ్యోనే. దుర్మార్గులారా! నాపై నీవు చేసిన యీ దుర్మార్గమునకు నాకింతమాత్రమును జుగుప్సలేదు కాని, మాయురే, నానిమిత్తమెంచ ఇట్టి చిక్కులఁ బొందుచున్నారో కదా ఓతింత్రిణీ!

సీ. నిముస మాలస్య మింటికి వచ్చుట కైన,
నెందుఁ గాంచెద నోయంచుఁ గుందుచుండు;
లేచి మఱఁగోపింపఁ జిత్తము నొచ్చునోయంచుఁ,
జేరి మెల్లఁగ బుద్ధిఁ జెప్పుచుండు;
బుధుఁ డెంత యయ్యు, నన్నెడఁగనియే యేకాక్కి,
పెంచి యేవేళఁ గాపాడుచుండు;

నేనట్టి వస్తువే • నియుఁ గోరఁ జాలఁ బెంచి
దైన, నయ్యది యియ్యఁ • బూనుచుండ;
గీ. ఇన్నిరీతుల దయఁజూడఁ • బిన్ననైన,
నన్నుఁ జెఱచుము మనుచున్నయో! • కన్నతండ్రి,
నిన్ను విడనాడినట్టి నా • విన్నదనము,
విన్నవెంత చింతిలుదువో, • యెన్నఁ దరమె ?

పోనిమ్ము. నీవారోగ్యదశలోనే యుండిన, నాకై వెదకుకొని వచ్చి, నా దురవస్థ తప్పింపఁ బ్రయత్నించి, నన్ను రక్షింతువను కొందునన్న, లేచి కూర్చుండనైన శక్తి లేని స్థితిలో నిన్ను విడచివచ్చితిని. నీకిఁక నెవ్వరు పరిచర్య చేయుచున్నారో కదా! ఓతల్లీ! పతివ్రతలలోఁ బేరుకాంచినదానవు. నీకు జెప్పవలసిన యవసరము లేదు కాని, శుష్కించియున్నయీ మహానుభావున కాధారము నీవే సుమా. అమ్మా! ఆపద్బాంధవుండయిన యీ పరమేశ్వరుఁడు పాపాత్ముండనగు నాపై దేవ తేవకుఁ గోపంబు నొందిన నొందవచ్చును గాని, సిద్ధసంకల్పవగు నీమాటయైన నెరవేర్పవద్దా! ఓసరోజినీ! "పది దినంబులలో నీవు తిరిగిరాకున్న నీసరోజిని నీటిలో మునిఁగి పోవు"నని నాతోఁ జెప్పినావుకదా. నిజముగా నీవాత్మహత్య చేసికొనినావా? ఆపత్కాలములో నీకింతయైన సాహాయ్యము చేయలేక, పంజరమున నిల్పఁబడిన పక్షివలె, నేనీకారాగారమున జీవముతోనుండుట, నీమరణవార్తను వినుటకేనా? అయ్యయ్యో, నేనుగూడ నీతో నాత్మహత్య చేసికొనకుండ, నేల నిలచియున్నాను? ఓ యంతరాత్మా! నా సరోజిని యింకను జీవముతో నున్నదని చెప్పి, నాకు

సంతోషము కలిగింప నెంచుచున్నావా? హృదయేశ్వరీ!
నీవు నిజముగా జీవించియేయుండి, యాపృథ్వనకే కష్టస్థితిఁ
బడియున్నావా? దొండపండు నోటఁగరచికొనిపోవు కాకి
వలె, నీపాలిటి కాలమృత్యుఁ డెవండై వచ్చెను? నీ కేలుపట్టు
టకు నాకుఁ బ్రాప్తి లేకున్నను, నీవు జీవముతోనుండి, యెం
తైన సుఖించి యున్నావన్న, నాకు నిష్టమే కాని, యాచీకు
ముసలి గద్దవాతఁబడి, యెన్ని చిక్కులఁ బొంది, నన్నుఁ ద
లఁచికొని, విచారించుచున్నావో కదా! నీయుదంతము
కొంచెమైన నాకుఁ దెలియకపోవుటయే కాక, యిట్లని వి
చారించుటకును వలనుగాకున్నదే! ఓపంచభూతములారా!

సీ. విశ్వాంతర వసంగ ♦ విపులాఖ్య ధరియించి,
పృథ్వివై వెలయు ధా ♦ త్రివిము తల్లి;
సర్వతోముఖ కీర్తి ♦ సాంద్రవై భువన జీ
వన సార్థకాభిఖ్యఁ ♦ దనరు తల్లి;
అఖిల జగత్ప్రాణ ♦ మన, సదాగతి యన
నాశుగ యశ మొంది ♦ నట్టి సఖుఁడ;
జాతవేదుఁ డనఁగ, ♦ నాతత శుచి సమా
ఖ్యాయ మొందినట్టి పా ♦ వకుఁడ సఖుఁడ

గీ. శబ్దగుణ మార్గాభిక్షేయంబు ♦ వెలయఁగా, న
నంత సదవాచ్యుఁడైన యా ♦ నంత సఖుఁడ,
కర్మసాక్షులు మీరలు ♦ గాన, నా స
రోజినీ వార్తలం దెల్పి ♦ ప్రోవఁ గదరె?

ఓభ్రమరమా!

ఉ. ఝుంకరణంబొనర్చుచును ♦ జక్కని మందిరమునందుఁ బాడుచున్
తెంకలఁ జూడ నేగుచుఁ బ ♦ తింప్రమ, దిత్తగ నేల నత్తు వా

వంకను జేరి, నా హృదయ•వల్లభు వార్తలఁ గొంచెమేనియున్
గొంకక తెల్పి రాఁగదవె, • కోరెద, నిన్నెద, నన్ను, తుమ్మెదా!

[ఖైదుబంట్రోతు ప్రవేశించి,]

బంట్రోతు.—ఏమయ్యా! ఎప్పుడు చూచిన, నేదియో యాలోచింపుచు, నేదోయొకలాగున నుందువు? ఇట్లయిన, పనులెట్లు జరుగును? ఈ దినమున హుజూరుగుమాస్తాగారు తనికీకి వత్తురు. వేళయైనది. పెద్దమడి దున్నవలెను పద.

ప్రభా.—కటకటా!

మ. జననంబయ్యరుణాచలార్యుని తప•స్సంపత్ప్రభావంబునన్
జనకశ్లాఘ్యభాగ్యపుత్రికా సద్వృత్త, సం•ధ్యాదేవి గర్భంబునన్
ఘన కారాగృహసీమయందు హల సం•ధానంబు కృత్యంబహో!
అనుభోక్తవ్యము కాదె, యెట్టిదయినన్ • ప్రారబ్ధ మెవ్వారికిన్.

(నిష్క్రమింతురు).

---

స్థలము 2. ఖైదు—ప్రభాకరునిగది.

[ప్రవేశము-ఖైదుయజమానుఁడును, ఖైదుబంట్రోతులు కొందఱును, పురుషవేషములోనున్న సరోజినితో].

సరో.—ఇదియేనా ప్రభాకరుని గది?

యజ.—చిత్తము.

సరో.—పుస్తకము తీసి, అతనిఁ గుఱించి యేమి వ్రాయఁబడినదో చదువుఁడు.

యజ.—(పుస్తకమువిప్పి) ప్రభాకరశాస్త్రి, తండ్రి అరుణాచల శాస్త్రి-కాపురము కంచిలి - నేరము దొంగతనము.

సరో.—(తనలో) మహానుభావుఁ డిట్టి యిక్కట్టులలోఁ బడి యున్నాఁడు? ఓహృదయమా! నీవే విగ్రహము నాశ్రయించియున్నావో యది యాడుదిఁయయ్యును, వేసినది పురుష వేషము సుమా!! అధైర్య లక్షణములఁ గనుపరచుట కిది సమయము కాదు సుమా!!! (ప్రకాశముగా) ఈయన చౌర్య మొనర్చెనా? ఎక్కడ?

యజ.—కుముదినీ దేవిగారి యింట్లో నొకనాఁడు రాత్రి యేటి ప్రక్కనున్న కిటికీకిఁ ద్రాడు వేసికొని, ప్రవేశించెను. అప్పుడు వారి సేవకులు మేలుకొనఁగా,ఁ దనయుత్తరీయమును విడచి, తొందరతోఁ బారిపోయెను. మరునాటియుదయమున నవాబుగారికి సంగతి తెలియఁజేయఁబడిన, నితనిని ఖైదులో నుంచవలసినదని హుకుమొసంగఁబడెను.

సరో.—ఏటిపైవైపున మేడకిటికీకిఁ ద్రాడెట్లు వేసికొనెను? వచ్చిన దొంగ లెందరు?

యజ.—ఆతప్శీలు నాకుఁ దెలియదు. ఆతఁడొక్కఁడే పోయినట్లు తోచుచున్నది.

ప్రభా.—(తనలో) ఈ కుమారుని మొగము నెప్పుడో చూచినట్లు తోచుచుండుటయే కాక, కంఠస్వనముకూడ నెప్పుడో వినినట్లే యగుచున్నది. ఏమి కారణముననో గాని, యితనితోఁ బలుకరించి మాటాడవలెనని యున్నది. మొగము చూచుచున్న కొలఁదియు నుత్సాహము, మాటలు వినుచున్నకొలఁదియు పారవశ్యముఁ బొంది, దుర్భరమగు నీకారాగృహావిచారమును మరచి, చిత్తమానంద బ్రహ్మ

మున మునుగుచున్నది. భూతకాలమున నితనితో నేట్టిసం
బంధమైనఁ గలిగియుంటినా?

సరో.—ఈయనచే నేమేమి పనులు చేయించుచున్నారు?

యజ.—దున్నుట.

సరో.—(తనలో) ఎట్టి మాటలు వినుచున్నాను? (ప్రకాశము
గా) భోజన మేమి పెట్టుచున్నారు?

యజ.—చోడిపిండి యంబలి పెట్టుచున్నాము.

సరో.—(తనలో) హా! హాతవిధీ!! నీ వెంత దుర్మార్గుడవు! లీయ
సినోరఁ జేదు మేపుచున్నావు! (ప్రకాశముగా) కఠిన శిక్ష
విధింపఁబడిన వారందఱికి నిట్లేనా?

యజ.—చిత్తము.

సరో.—నేరస్థుని స్థితిగతుల నాలోచింపరా?

యజ.—ఇందనుక నట్లు జరుగలేదు.

సరో.—అట్టి మార్పుల వసరము కాదా?

యజ.— అవసరమే.

సరో.—ఈసంగతి నేను దివాన్‌గారితో మనవిచేసెదను. (తన
లో) ఈమహానుభావుఁడు కారాగృహ కష్టముల కెట్లు కృ
శించి యున్నాఁడు! (ప్రభాకరునితో) దివాన్‌గారితో మి
మ్ము గురించి మనవి చేయువలసిన యంశము లేవైనఁగలవా?

ప్రభా.—(తనలో) నాతోనే మాటాడుచున్నాఁడా? ఏమి నా
యదృష్టము? (ప్రకాశముగా) ఏమియును లేవు. ఇక్కడి
యుద్యోగస్థు లందఱును మంచివారే. స్వధర్మమును నిర్వ
ర్తించుకొనుచున్నారు గాని, యితర విషయములలో నేమి

యు నిబ్బంది కలుగఁ జేయలేక.

సరో.—(తనలో) ఆహా! యేమి యీతని సాహస్యత? సుఖదుః ఖములను నేకముగాఁ జూచిన వాని నీతని నొక్కనినే జూచి నాను. (ప్రకాశముగ) మీ బంధువులను గూర్చిన సమా చారము లేమైన మీకుఁ దెలిసికొనవలసియున్నదా?

ప్రభా.—నాతల్లిదండ్రులయు, నాసరోజినియు, క్షేమము తెలి సిన యెడలఁ జెప్పుడు.

సరో.—మీతండ్రిగారు క్షేమముగానున్నారు. మిమ్ముగూర్చి దివాణగారిపేర నొక యుత్తరము వ్రాసియున్నారు. కొద్ది రోజులలో నిక్కడకు వత్తురఁట.

ప్రభా.—చిత్రము. (తనలో) వారువచ్చిన, నాకీచెఱసాలనుండి వి ముక్తి కలుగును.

సరో.—మీతల్లిగారును, క్షేమముగానున్నారు.

ప్రభా.—సరోజిని సమాచార మేమి?

సరో.—(తనలో) ఎంతవిపరీతము? నన్ను నేనే మరుగు చేసికొన వలసి వచ్చెను. (ప్రకాశముగా) సరోజిని యెవ్వరు?

ప్రభా.—అది నాప్రాణధనము. సాగరశాస్త్రిగారి కుమార్తె.

సరో.—కంచిలినుండి వచ్చిన యొక బ్రాహ్మణుఁడు వింతకథ యొకటి నిన్నఁ జెప్పినాఁడు.

యజ.—(తనలో) ఇందఱు ఖైదీలను జూచినాఁడు కాని, వా రెవ్వరితో నిట్టి సంగతులను మాటాడలేదు. వీరిద్దఱు కేమై నఁ జుట్టరిక ముండునా?

సరో.—పెండ్లిముహూర్తము నిశ్చయింపఁ బడిన నాఁటిరాత్రి

సరోజినియను పేరుగల యొక కన్యక మాయ మయ్యెనట. యౌవనపురుషు నొకనిఁ బ్రేమించిన యాకన్యకను, వృద్ధునకుఁ బెండ్లిచేయఁ బోవుటయే యందునకుఁ గారణమఁట.

ప్రభా.—అదియే నాసరోజిని. తరువాతి సంగతి యేమి?

సరో.—ఎవ్వరికిని దెలియదు. పలువురు పలువిధముల ననుకొనుచున్నారు.

ప్రభా.—అయ్యయో! సరోజినీ!! ఎంతపనిచేసితివి! ఎక్కడకుఁ బోయితివి? నాకై వెదకుచున్నావా? అట్లయిన, నాకేల కనుపడవు?—ఏల యిట్టి యడియాసల నొందుచున్నాను? అట్టి గుణవంతురాలను నేను చూచునంతటి యదృష్టము నాకబ్బునా?

సరో.—(తనలో) నిష్కల్మషుఁడగు నితని నిట్టియవస్థలోఁ బరీక్షింప వలసివచ్చెనా? ఎంత పాపాత్మురాలను? అంతర్బాష్పుండయ్యు, నిర్మలాంతరభావుఁడు తనకన్నీటి నాపుకొన లేకున్నప్పుడు, అట్టి యవస్థను గన్నులారఁ జూచుచున్న నేను మాత్ర మాపుకొనఁ గలనా? ఓహృదయమా! నాపురుషవేషమునకు భంగము తీసికొని రాకుమా! (ప్రకాశముగా) అదృష్టమున్నఁ జూడవచ్చును. సరే! మీకు చెప్పవలసిన యంశములేవియు లేవు గదా!

ప్రభా.—లేవు.

సరో.—నాయుఁడుగారూ! ఇప్పటి కీపని నిలుపు చేయుదము. రెండవ పూటవచ్చి,మిగిలిన పని పూర్తిచేసెదను. పోదము రండు.

(పరిభాషకుఁడుతప్ప, అందరును ముందునకు వచ్చిన, వెనుక తెరజారును).

యజ.—చిత్తము. నాకు సెలవిండు.

(సరోజినితప్ప, అందరును నిష్క్రమింతురు.)

సరో.-(స్వగతము) కటకటా! యెట్టిచిక్కులనొందుచున్నాఁడు?

సీ. పారదచ్ఛన్న సౌ◆వర్ణంబు భాతిని,
తెల్లఁబారిన మేను ◆ తీగ తోడ;
పాంసులాచ్ఛాదమౌ ◆ వజ్రంబు రీతిని,
చెన్నుమాసిన మేలి◆వన్నె తోడ;
భస్మసంవృత చిత్ర◆భానువు రీతిని,
దాఁగియుండిన శుచి◆త్వంబు తోడ;
ఛాయాగ్రహగ్రస్త ◆ సౌరబింబము భాతి
నిమ్మడంగిన ప్రతా◆పమ్ము తోడ;
గీ కఠినకారాగృహావాస ◆ కష్టనికర
జనిత శోకావృతాత్ముఁడై, ◆ యనఁగ రాని,
బాధ లొందుచునున్నాఁడు ◆ ప్రాణవిభుఁడు,
"దైవకృతమునకేలనసాధ్యంబు కలదె?"

సరో.—కానిమ్ము. భగవంతుని యనుగ్రహంబున దివానుగారికి నాయందుఁ బుత్రవాత్సల్యము కలిగినదికదా. ఆకారణమున, నే నిదివరకు నాయథార్థస్థితి యంతయును నాయనతో మనవి చేసితిని. చేతనైనంత సాయము చేసెదనని యాతఁడు వాగ్దత్తము చేసెను. అంతఃపురసంబంధమగు ఫిర్యాదగుటచే నింత యాలస్యమగుచున్నది కాని, లేకున్న, నీపాటికి నాకార్యము సఫలమై యుండును. ఏది యెట్లున్నను నాప్రాణేశ్వరుని నేను దక్కించుకొనువరకును, ఇక్కడి చి

క్కుల సన్నిధిని నేనే దివానుగారితో మనవిచేసి, యాతనికి వలయు సదుపాయములు కలుగునట్లు చేసెదను. ఆపైని దైవేచ్ఛగదా. కాని, నాప్రాణేశ్వరుని కిట్టి కష్టము కలుగుటకు కారణము ఒక యూడుదాని దుస్తంత్రమే యని వినినప్పటినుండియు నాయొడలు మండుచున్నది. అన్నా కుముదినీ!

చ. ఇనుమునకన్న మిన్నయగు ♦ నింతటి గట్టితనమ్ము ప్రాని, స
జ్జనులను, పాపపుం బనులు ♦ సల్పఁ దలంపఁగఁ బోని వారలన్,
గనికర మింతలేక, కఠు♦గారియలం బడద్రోయుచుండి, యె
య్యన ముదమందఁ గోరు టిది ♦ హైందవకన్యకు నీతిఁ బోలునే!

(నిష్క్రమించును).



## స్థలము 3. వీధి.

[ప్రవేశము — చతుర స్వగతము].

కాంతాకనకములకు లొంగని వారీప్రపంచంబున లేరు గదా! సమయము దొరకకపోవుటచేఁ గొంతయాలస్యమైన నయినది గాని, నాపని నేటితో సగము తీరినది. ఆ జెయిలు యజమానుఁడు కనకవశుఁడై, నేనెట్లు చెప్పిన నట్లుచేసెదనని వాగ్దత్తము చేసియున్నాఁడు. ఇఁక మిగిలిన సగము పనియును పూర్తియగుట కీసీనాయే చాలును. ప్రభాకరుఁడు దిట్టమైన గుండె కలవాఁడే. కానిమ్ము. అయిననేమి? “పురుషుఁడాజ్య ఘటంబు, తరుణియగ్నికణంబు” అని పెద్దలు చెప్పియున్నారు కదా. కుముదినీదేవిగారి మనోరథ మీడేరుట కేమి యభ్యంత

రము: ఎంతపేరుకున్న నేయియైన, నగ్నిహోత్రసాన్నిధ్యమునఁ గొంచెము సేపు కాకున్న, మఱి కొంచెము సేపైనసల్పినచోఁ గరగిపోవకుండునా? నేనిప్పుడే పోయి, కుముదినీ దేవిగారితో, నావిజయమును జెప్పెదను.

(నిష్క్రమించును).



స్థలము 5. కుముదినిమేడ.

[నిద్రలోనున్న ప్రభాకరుఁడు మంచముపైఁ బండుకొనియుండ, కుముదిని ప్రక్కను నిలచియుండును].

కుము.—(తనలో) కటకటా! నామనస్సాక్షి వలదని యెంత చెప్పినను, నిరపరాధియగు నీతని కిట్టికష్టములు కలుగఁజేయుటకుఁ గారణము మోహమే కదా! గ్రాహగ్రస్తమగు గజమున కా పురుషోత్తముఁ డెట్లు గతియయ్యెనో, మోహగ్రస్తనగు నాకు నీ పురుషోత్తముఁడట్లె గతి యగుఁగాక.

ప్రభా.—(కదలుచు), సరోజినీ! సరోజినీ!! (పలువరించును).

కుము.—(తనలో) ఈసరోజిని యెవరు ?

ప్రభా.—(మరల, కదలుచు) సరోజినీ ! నీముఖము చూచుటకు నాకింకను ప్రాప్తిలేదా. (మరలఁబలువరించును)

కుము.—సరోజిని యను నొక కన్యక నీతఁడు ప్రేమించుచుండెను గాఁబోలు. కొంచెము తెలివి వచ్చుచున్నది. లేపెదను. (ఒడలుపైఁ జేయివైచును). మనోహరా ! లెమ్ము.

ప్రభా.—ఆహాహా ! నాసరోజిని కరస్పర్శనమేనా ? (లేచి సంభ్రమముతోఁ జూచును).

కుము.—(తనలో) నిశ్చయమే! సరోజిని యీతని హృదయేశ్వరియే. సరోజినిపై నాశఁగొనిన ప్రభాకరుఁడు కుముదినిని తేరిచూచునా!

ప్రభా.—ఇదియేమి? కారాగృహమున నేలను బండుకొనియున్న నేనీ హంసతూలికాతల్పముపై కెట్లు వచ్చితిని? ఈప్రక్కను నిలచినది యెవ్వరు? కుముదిని. అయ్యయో! ఈ భూతము నన్ను విడువక, మరల మోసపుచ్చి తెచ్చెనా?

కుము.—మనోహరా! ప్రభాకరా!! ఇదె నీపాదములను బట్టుకొనుచున్నాను. నీపట్టుదల నింక విడచితివా లేదా?

ప్రభా.—ఛీ! మూర్ఖురాలా!! దూరముగా నుండుము.

కుము.—ప్రభాకరా! నా నేరమును క్షమించుము. నేను నీకొసంగుచున్న కష్టములు నీయందలి మోహముచేత నేగాని కోపముచేతఁ గాదు. నీవింకఁ బట్టుదల విడువనిచో, నామృతికిఁ గారకుఁడవగుదువు. స్త్రీ హత్యచేయుట నీబోటి వానికిఁ దగదు.

ప్రభా.—దుర్భాగ్యురాలా! నీవు నా కొనర్చుచుండిన యపకారమునకు, నాకుఁ గోపము లేదు కాని, నీ మూలమున మఱి కొందఱు నిరపరాధులుకూడ కష్టము లొందుచున్నారు. అదియైన నాలోచింపకున్నావు.

కుము.—(తనలో) మఱి కొందఱు నిరపరాధు లనుచున్నాఁడు. సరోజిని నుద్దేశించియే కాఁబోలు. అయ్యయో! నే నా సరోజినీ జన్మమైన నెత్తక, యిట్టి తుచ్ఛజన్మ మేల యెత్తితిని? (ప్రకాశముగా) ప్రభాకరా! నీవు తిట్టినను, కొట్టినను గూడ

నాకుఁ గోపము లేదు. వలపన నేమియో యెఱుఁగని వాడ నగుటచేఁ దూలనాడితివని నే నిదివరకనుకొనుచుంటినిగాని నీవిప్పుడు, "సరోజని" యను నొక నామమును పలువరించుటచే మోహమున మునుంగువారి బాధలన్నియు నీకుఁ దెలియు నని యే బుజువైనది. అయ్యయో! తెలిసి తెలిసి నన్నేల వేధించుచున్నావు?

ప్రభా.—(తనలో) సరోజనీ నామ ముచ్చరించితినా? అయ్యయో, నిద్రాదేవి!

గీ. అతిరహస్యములైన వాక్యములైన,
పలువరింతల మిషచేత వెలినిఁబెట్టి
యుపకృతి యొకప్పు డపకృతి యొక్కయప్పు
డాచరింతువు, చిత్రమ్ము నీ చరితము.

నీ విప్పుడు నా కొనర్చినది యపకారమే కాని యుపకారము కాదు.

కుము.—మనోహరా! ఏల మాటాడవు? నా యధీనములోనే నీవు నిలచి యున్నావు గనుక, నేఁ జెప్పినట్లు వినరాదా? నన్నే సరోజనిగానే భావింపరాదా?

ప్రభా.—పవిత్రమగు సరోజనీ నామము నీ నోటఁ బెట్టి యేల యపవిత్రము చేసెదవు?

కుము.—(తనలో) ఆహాహా! ఆమె యెంతటి యదృష్టవంతురాలో కదా! ఆనామము నే నుచ్చరించుటకైనఁ దగనట! (ప్రకాశముగా) విప్రకుమారా! ఎక్కడనో, ఎప్పుడో చూచిన సరోజనిపై నేల మనసు నిలిపెదవు? నీవిప్పుడు కా

రాగారమున నున్నావు. అంజలి కష్టముల భరించుట దుస్తరము. నామాట వినుము. నీకీ యూరిలో నుండుట కష్టమని నాకుఁ దెలియును. నాయొద్ద లక్ష రూపాయీల విలువగల నగలున్నవి. రాత్రివేళ నొంటిగా మన మిద్దరమును గలసి యెక్కడికైనఁ బోయెదము. నీ పాదములొత్తుచు నీ సేవ చేసికొను చుండెద.

ప్రభా.—తుచ్ఛురాలవగు నీపై నాశ గొననేమో యని భయపడి, తుచ్ఛతరమగు ధనముపైనైన నాశ గొల్పుచున్నావా? అపవిత్రములగు వాక్యములను నా చెవులలోఁ బోసి నన్నేల యపవిత్రునిగాఁ జేయుచున్నావు?

కుము.—మనోహరా! నిన్ను కేవల దైవస్వరూపునిగానే భావించుచున్నాను. కావున, నాపై నిట్టి యనిర్వచనీయమగు కోపము పూనుట పాడియా? కోపాగ్నిచే నెఱ్ఱగనున్నప్పుడే నీచూపులు నా మనమ్మున నింతటి మోహము పుట్టించుచున్నప్పుడు, దయయను నమృతముతో నిండి, తెల్లనై యున్న, నింక నెంత మోహము పుట్టించునో తెలిసికొనకూడదా! శ్రవణకఠోరములగు నీ నిందా వాక్యములే నీపై నింత భక్తిని బుట్టించుచున్నవి కదా, మకరంద రసపూరితములగు మధుర వాక్యము లెట్టిభక్తిని బుట్టించునో, యదియైన నెఱుఁగరాదా! నీవికఁ నా మాట వినకున్న, ఈ కేశపాశముతోనే, నాకంఠమున నురి పన్ని, దేహము చాలించెద. కీర్తియో, యపకీర్తియో, నీకే దక్కనిమ్ము. (నిక్కిలి సమీపించును).

ప్రభా.—(తనలో) శ్రుతి మించి రాగమునఁ బడినది. ఇంకఁ

ఓష్ఠముల సన్నికీతుల సం♦యమున్, భయమున్, నెఱుంగఁ జేసినన్,
ఘట్టనటీపరిభ్రాంత గతి, ♦ కార్యము సర్వము వ్యర్థమయ్యెనే!

సరే! ఇది రెండవ ప్రయత్నము కదా! ముచ్చి ముమ్మారను న్యాయమును సార్థకముగా, మఱియొకమారు ప్రయత్నించెద. చతుర తెచ్చిన యౌషధ ప్రభావము కలదు గదా. [illegible]టకు.—

గీ. చిత్తవృత్తి నిల్పి, ధాతువు ♦ నాపి వేయు,
తనువుఁ జైతన్య రహితమై ♦ తనరఁ జేయు,
కొన్నిగంటల దనుకను ♦ జెన్ను బాపి,
మరణ చిహ్నములను గనం♦బరచు సహహా!

అట్టి సహాయము కలుగ, నా కేమి లోపము? ఓసరోజినీ!

ఉ. ప్రాగ్గగనాద్రి నిల్చి, యను♦రాగ మెసంగఁగ, సాంధ్యరాగముల్
రాగ విలాస భాసియయి ♦ యొప్ప, ప్రభాకరు నూత్నహస్త ము
ద్యోగము తోడ, మే నిముసు♦ మండిన వేళల, నెట్టి యింపునన్
మూగుచు నుందువో, యతిమ♦నోహర సౌఖ్య రసాబ్ధి నీఁదుచున్,

(నిష్క్రమించును).

స్థలము 5. వీధి.

[ప్రవేశము: సంధ్యాదేవియును, అరుణాచలశాస్త్రియును, నడచుచు]

సంధ్యా.—కావున, దివాన్‌గారి లోప మేమియు లేదందురా?

అరు.—అవును. వారికిఁ దోఁచిన ప్రయత్నము లన్నియు వారు

చేసినారు. అంతఃపుర సంబంధమగు ఫిర్యాదునకు చేత నింత యాలస్య మగు చున్నదట!

సం–వారు చేసిన సదుపాయము లేవియో మీతో, జెప్పలేదా?

అరు.—లేదు. ఆసంగతి యంతయును, వారి గుమాస్తా నడిగి తెలిసి కొను మన్నారు.

సంధ్యా.—అట్లైన, ఆ గుమాస్తా యొద్ద కిప్పుడేపోయి తెలిసికొన కూడదా!

అరు.—ఆతని బస దివాన్‌గారి యింట్లోనే. ఇంటియొద్ద లేడు. ఎక్కడికో పోయి యుండెను.

[ప్రవేశము—పురుష వేషముతో సరోజిని].

సరో.—(తనలో) ఉత్తరము వ్రాసిన [illegible] మరుణాచలశాస్త్రి గారు వచ్చినారు. పాపము కుమారుని జూడవలెనని యెంత యాత్రముగా నుండునో (ప్రకాశముగా) అయ్యా! నమస్కారము.

అరు.—నమస్కారము. అయ్యా! మీ రెవ్వరు? ఎక్కడనో చూచి నట్లున్నది. గుర్తుపట్ట లేకున్నాను.

సంధ్యా—(తనలో) నేను నట్లే యనుకొను చున్నాను. ఏమి జవాబు చెప్పనో?

సరో,—నేను దివాన్‌గారి గుమాస్తాను. నన్ను బహుశః ఈ శ్రీకాకుళములోనే యెప్పుడో చూచియుందురు.

అరు.—మీరేనా, దివాన్‌గారి గుమాస్తాగారు అడబోయిన తీర్థ మెదురైన యట్లు మీదర్శన మిక్కడనే దొరికినది. నేను అరుణాచలశాస్త్రిని.

సహో.—తమదర్శనము చేయవలెనని యనుకొనుచుంటిని. చాల సంతోషమైనది. నాకుఁ గొప్ప చిక్కు కలిగినది.

అరు.—అవును. మా కుమారుని మీ రప్పు డప్పుడు చూచు చుందురా?

సహో.—తరచుఁగాఁ జూచుచున్నాను. ఆయన క్షేమముగా నున్నాఁడు.

సంధ్యా.—నాయనా! వాఁడు పడుచున్న కష్టములను గొంచె ము తెలియఁజేయరా.

సహో.—అమ్మా! ప్రస్తుత మాయన కేమియుఁ గష్టములేదు. వేషనకే శ్రీకుగాని, బ్రాహ్మణునిచే వండించి, భోజన మొసంగుచున్నారు. రాత్రులయందు పాలు నొసంగుచున్నారు. కఠినకృత్యము లేవియు జేయింపలేదు. చదువుకొనుటకుఁ బుస్తకముల నొసంగుచున్నారు.

సంధ్యా.—నాయనా! నిన్ను జూచినతోడనే, మా యబ్బాయిని జూచి నట్లే సంతోష మైనది.

[ప్రవేశము పద్మలత-సాగరులు].

సాగ.—అరుణాచలశాస్త్రిగారూ! తామువచ్చిన పనియేమి యైనది?

అరు.—కొంతవరకు బాగుగనేయున్నది. మీ పని యెట్లున్నది?

సాగ.—ఏమియును జాడ కన్పట్టలేదు. ఈ యబ్బాయి యెవ్వరు? ఎప్పుడో చూచినట్లున్నది.

అరు.—ఈయన దివానుగారి గుమాస్తాగారు.

పద్మ.—ఈతనిఁ జూచినతోనే నాకడుపు చెరువగుచున్నది.

ఊరును, పేరును నడిగిన బాగుగనుండును గాని, అడిగిన నేమి తప్పో.

సరో.—(తనలో) ఈదినము సుదినము. పూజ్యులనందఱను జూడఁ గలిగితిని. నా తలిదండ్రులను బలుకరింపవలె నని యున్నది కాని, యీస్థితిలో మాటలాడ వలసిన యంశము లేవియు లేవు. క్షేమముగానున్నారుకదా! నాకంతియేచాలును,

అరు.—సాగరశాస్త్రిగారూ! నాకుఁ బనియున్నది. నేను సెలవు తీసికొనెదను,

సాగ.-మేమును సెలవు తీసికొనెదము. స్నానమునకుఁబోవలెను,

(సరోజినితప్ప యందఱును నిష్క్రమింతురు).

సరో.—(స్వగతము) నాతండ్రి నా కొసంగిన విద్య సహాయమున నేనాపని మెల్లఁగా సాధించుచున్నాను. ఆడవారుగా రెంత మంచివారు? కారాగృహమునకు నాయిచ్చకు వచ్చినప్పుడు పోయి, అక్కడి వ్యవహారములను బరీక్షింపవచ్చునని యనుజ్ఞ యొసంగినారు. ఏకారణముననో గాని, నా మనోనాథుఁడు నేను కంచిలిలో సరోజిని గానే యున్నప్పుడు, ఎంత గౌరవించుచుండెనో, ఇప్పుడంతకన్న నెక్కుడు గానే గౌరవించుచున్నాఁడు. రహస్యములు కూడ నాతోఁ జెప్పుచున్నాఁడు. నన్నుఁ బోల్చి వేసెనా? కాదు. అతని నిష్కల్మష హృదయమె దీనికిఁ గారణము. కోప మనుమాటయైన లేని మహానుభావుఁ డీతఁ డొక్కఁడే. ఓప్రాణేశ్వరా!

క. మానుషికమైన, దైవిక
మైనను, మఱియొక విఘాత • మలవడకున్నన్

నే నిను రక్షించుకొనం
గానగు, జ మ్మింక, నల్ప కాలములోనఁ.

(నిష్క్రమింతురు).

## స్థలము 6. ఖైదు.

[ప్రవేశము—ప్రభాకరుఁడును, పురుష వేషముతో
సరోజినియును కూర్చుండి]

సరో.—స్వప్న గోచరములగు నిట్టి యంశములకు విచారించుట
తగునా ?

ప్రభా.—నా కది స్వప్నమే యని యింకను నమ్మకము కుదుర
లేదు. యదార్థమువలెనే తోఁచుచున్నది.

సరో.—మీరు చెప్పిన కథలోని పూర్వాపర సందర్భములనుబట్టి
యాలోచించి చూచిన, నది కలకాక, యదార్థ మెట్లగును?
నిద్రించు నప్పుడు మీ రేస్థలమున నుండిరో, యా స్థలమున
నే కదా, మేలుకొని నప్పుడు కూడ నుండిరి. అది స్వప్నమే
కాకున్న, కుముదిని మేడకుఁ బోవుట మీ కెట్లు సాధ్యమగు
ను ? ఒక వేళ పోయియే యుండిన, మీ కెఱుక లేక యది
యెట్లు జరుగును ? లేక, ఆమెయే యిక్కడకు వచ్చియుం
డు ననుకొందు మన్న, కుముదినిని మేడలోఁ జూచితి మని
కదా చెప్పుచున్నారు. కారాగృహము భవనముగా నెట్లు
మారగలుగును ? నిరంతర జాగ్రదవస్థలో నుండు మీకు,
కారాగృహవాస కష్టమున సుషుప్త్యవస్థ కలుగుట సహజ

ము. కాని, విచారా క్రాంతా త్ములగుటచే, గాఢ సుషుప్తి కలుగుట దుస్తరము. గాఢసుషుప్తి లేకపోవుటచే స్వప్నావస్థ కలుగుట యబ్బురము కాదుగదా!

ప్రభా.—మీమాట యొప్పుకొనెదను గాని, స్వప్నమునకుం బోయినను, విజీయాకు తప్ప లేదన్నట్లు, స్వప్నావస్థలోం గూడం గుముదినియే కన్పట్ట వలెనా?

సరో.—ఏయంశములు మన మనస్సులో నెల్లప్పుడును నిలచి యుండునో, యవియే కదా! స్వప్నమున మనకుం దోచు చుండును. ఇంత యేల, అనుభవమున నెఱుఁగని యంశమే దియు స్వప్నమునఁ గన్పట్ట దని యే కదా తజ్ఞులందురు.

ప్రభా.—అవును. బాగుగా జ్ఞాపకము చేసితిరి. మీ యసాధారణమేధావిశేషమునకు నానందమయ్యెను. రాజకీయోద్యోగమున, నున్న మీరు, నాబోటి వానితో నింత చనవుగా మాటాడుటవలన, మీకుం గల నిగర్వత్వము తెలియుచున్నది. అత్యల్పవయస్కులయ్యు, మీరింతటి ప్రతిభాశాలురగుట కెంతయు నాశ్చర్య మగు చున్నది. మిమ్ముం జూచిన దినమ్మున నా మనమ్మున నంకురించిన భక్తి-కాదు - అనురాగము-కాదు-ప్రేమము-అదియునుగాదు-ఏదో యొకవిధమగు మనోభావము మీతోడి సంభాషణ యను దోహదమునం బెద్దదియై, పూవులు పూచు చున్నది. నాకింతియే చాలును. మీరు నా కొనర్చిన సదుపాయముల మాట యటుండ, మీతో మాటలాడుట వలనం గలిగిన యానందమునం గారాగృహావాసమే కాక, ప్రాపంచిక నివాసమే మఱ

చి, నాయాత్మయానంద బ్రహ్మమునఁ బరిణమించుచున్నది.

సరో.—(తనలో) కటకటా! ఏమి కాలవైపరీత్యము? ఏ మహాత్ముని పాదసేవకై యాశించుచున్నానో, యామహాత్ముని చేతనే పొగడించుకొనవలసి వచ్చెనా? (ప్రకాశముగా) అయ్యయో! వ్యర్థముగ నన్నేల యిట్లు పొగడుచున్నారు. మీకుగల్గిన యీకష్టములను దొలఁగింప లేనైతిని గదా! యని విచారించుట తప్ప, నేఁ జేసిన యుపకార మేమి? ఎట్టి ముహూర్తమున మీదర్శనము నాకు లభించెనో గాని, గోసిముసము మొదలు, మీపై నాకుఁ గల గౌరవము దినదినాభివృద్ధి నొందుచున్నది. ఆకారణమున మిమ్ముఁ జూడకుండ, నే నించు కంతయు, నిలువ లేక పోవుచున్నాను. కావున, మీదర్శనమునకై దినదినము నేదియో వేళకు వచ్చుచున్నాను. విద్యావయోవృద్ధులగు మీబోటి వారు, నాబోటి యల్పజ్ఞులు చేసిన యీచిన్న పనికై యింత పొగడుట తగదు.

(బంట్రోతు ఒక గాజుపాత్రముతోఁ బాలను దెచ్చి విడచిపోవును).

ప్రభా.—వ్యర్థముగా నేనెప్పుడు నెవ్వరిని బొగడను. ఇదిగో! చూచితిరా!! మీ దయవలన నాకుఁ గలిగిన యీలాభము.

[చతుర చాటునఁ బ్రవేశించును].

చతుర.—తనలో అయ్యయో! కానివేళ వచ్చితిని గదా. ఈ గుమాస్తా యింతరాత్రియప్పు డేల వచ్చెను? వచ్చె నను సంగతి బంట్రోతైన చెప్పరాదా. ఈపాలు త్రాపుటవలన,

ప్రభాకరునియందుఁ గలిగిన మార్పును, గుమాస్తా కనిపెట్టెనచో, నా జెయిలు యజమానునకును, తన్మూలమున మాకును, నెట్టిచిక్కులు కలుగునో కదా! ఇంతకును, ఆ బంట్రోతుని మాంద్యమే కారణము. ఓ సేవకులారా! మీ మాంద్యమువలన నెట్టి నష్టములు సంభవించుచుండును!

సరో.—ఇది మీయందుఁగల గౌరవమును వృద్ధునకు శాఖ కాని, మఱియేమియు లేదు.

ప్రభా.—మీతో వాదింపవలసిన వాఁడను కాను. పోనిండు. మీకు నాయందంత గౌరవమే యున్న, నాకుఁ గల యొక కోరికను నెరవేర్పుఁడు.

సరో.—ఏది?

ప్రభా—ఈపాలలోఁ గొన్ని మీరు త్రాగి, మిగిలినవి నన్నుఁ ద్రావనిండు.

చతుర.—(తనలో) త్రాగును కాఁబోలు. ఏమి మోసము రానున్నదో!

సరో.—అయ్యయ్యో! మీ దేహసంరక్షణకై యేర్పాటు చేయఁబడిన యీ కొలఁదిపాలును నన్నుఁ ద్రావుమనెద రేల? నేను నాబసకుఁ బోయి త్రాగెదను. మీరు త్రాగుఁడు.

ప్రభా.—మీ బసలోఁ లే వని నా యభిప్రాయము కాదు. చెంత నున్నవారి కొసంగక, యేవస్తువు ననుభవింపఁ గూడదు. అందును, ప్రాణమిత్రులును, ప్రాణదాతలు నగు మిమ్ము విడచి, యీవస్తువును నే నెట్లనుభవింపఁ గలను? కొంచెము త్రావుఁడు. మీరు త్రాగకున్న నేనును ద్రాగను.

చతు.— (తనలో) ఉభయులును మాని వేసిన, బాగుగనుండును.

సరో.—(తనలో) ఈయన మనస్సును నొప్పించుట నాకిష్టము లేదు. (ప్రకాశముగా) సరే—అట్లనే త్రాగెదను. కాని, పెద్దలు కావున, తాము ముందు కొంచెము త్రాగి, మిగిలినది నా కిచ్చి వేయుఁడు.

ప్రభా.—అట్లు కాదు. అతిథి తర్పణము ప్రథమకర్తవ్యము.

చతు.—(తనలో) అతిథితర్పణము మాట యేమోకాని, వీరికిఁ దర్పణయోగ్యత కలుగును గాఁబోలు.

ప్రభా.—కావున, మీరే ముందుగ త్రాగుఁడు.

సరో.—మీయిష్టమునకు వ్యతిరేకముగ నడచుట నా కిష్టము లేదు. (గాజుపాత్రను బట్టుకొనును).

చతు.—(తనలో) అన్నా! కొంప మునిగి పోవుచున్నది గదా.

సరో.—అయ్యయో! యేమి గ్రహచారము? ఇం దేదియో వింత వాసన కన్పట్టినది. నేనే త్రాగితిని గనుక, సరిపోయినది. కీడెంచి మే లెంచవలెను.

చతు.—(తనలో) ఈయనపోల్చివేసెను. నిన్న రాత్రి కూడ, నీ మోషధియే మిశ్రమము చేసితిని గాని, ప్రభాకరుఁడు పోల్చలేక పోయెను. దానికిఁ గారణ మతఁడు పరధ్యానముగా నుంటయే కాఁబోలు.

ప్రభా.—(తనలో) హాస్యమునకుఁ గాఁబోలు ననుచున్నాఁడు. నేను నట్లే జాబుచెప్పెదను. కీడుగాని, మేలుగాని, ప్రాణమిత్రులు సమముగా ననుభవింపవలెను. మిగిలినవి నా కిచ్చి వేయుఁడు. నేనును త్రాగెదను.

సరో.—వలదు. వీరు క్రోలవలదు. (ప్రభాకరుఁ డగ్గఱకువచ్చిన, తప్పించుకొని, పారఁబోయును).

ప్రభా.—(తనలో) హాస్యము కాదు నిజమే. ఏమి మోసము వచ్చెనో కదా!

సరో.— [illegible] ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!!

ప్రభా.— [illegible] ఏమిది? ప్రాణేశ్వరా యనుచున్నాఁడు? [illegible] స్త్రీ! ఏమి, యేమి? యెట్లున్నది?

సరో.— [illegible] ముసుఁగుతీసి పారవైచి,) ఓ నాపురుష [illegible] బొమ్ము. నీ వేకార్యమునకై యుద్దే [illegible] యదిపూర్తిగా కాక మున్నే, నాప్రాణము [illegible] చున్నావు. ప్రాణేశ్వరా! నేను పురుషుఁడను [illegible] నేను నీ సరోజినిని.

ప్రభా.— [illegible] సరోజినీ! సరోజినీ!! అయ్యయో! నిన్నెట్టి యవస్థ [illegible] చుచున్నాను? (వడఁకును).

సరో.— [illegible] ముల్లైనవి. నిన్నుఁ బెండ్లి యాడుట [illegible] యున్నాను. నీ పాదములయొద్దనే [illegible] (మొలనున్న ఖడ్గముతీసి) ఓఖడ్గమా! [illegible] కేదియు నసాయము రాకుండ, కా [illegible] నీ పని తీరినది. దూరముగాఁ బొమ్ము.

ప్రభా.—సరోజినీ! - భయములేదు. నిలువుము. ధైర్యము నొందుము.

సరో.—అంతయును సరి. కనులు చీకట్లు క్రమ్ముచున్నవి.

ప్రభా.—(గడగడ వడఁకును).

సరో.—ఇదె నీ పాదసేవ చేయుచున్నాను. నన్ను మఱచి పోకుము. (పాదములు పట్టుకొని, నేలఁ బడిపోవును).

ప్రభా.—(నాడిచూచి) నాడి నిలిచిపోయినది. (గుండియపైఁ జేయివైచి) గుండెకూడ నాగిపోయినది. (ముక్కుకడఁ జేయిఁ బెట్టి) ఊపిరి లేదు. నిజముగానే చనిపోయినది. నేనెంత నిర్భాగ్యుఁడను!

చతు.—(తనలో) నేనను కొనినట్లే యైనది. ఈ సమాచారము కుముదినికిఁ దెలియజేయవలెను. (నిష్క్రమించును).

ప్రభా.—మారువేసమునవచ్చి, నా కొరకెంతయో కష్టపడి, యెంతయో యుపకార మొనర్చి, మబ్బుచాటునున్న మెఱుపు మెఱసినట్లు నిజరూపముతో నొక్కసారి కనుపడి, మరల మాయమైతివా! సరోజినీ!! నే నింక నెట్లు జీవింతును? ప్రాణమంతయును నాకే యర్పణచేసిన నీవు లేని యీ లోకమున నాకేమియున్నది? ... ... ... ... ... ... ... నీయూర్పుఁదావుల నాపివేసిన యా మృత్యుదేవుని సామర్థ్యము అసాధారణమగు నీ యందము నింతయైన తగ్గింపలేకుండెను.

సీ. అతను కేతనములఁ ♦ బోలెడు నీకను దోయి
మాయఁ బారియును, సొంపు విడఁ బోవు;
ముకురంబులం బోలె ♦ పొలయు నీ చెక్కులు,
వాడఁ బారియుఁ దళ్కుఁ ♦ బాయఁ బోవు;
చివురు జొంపంపు మేల్ ♦ త్రోవరొప్పు వాతెర,
వెల్లఁబారియు, రక్తి ♦ వీడఁ బోదు;

చాకఁ్ంపుఁ జొక్కాలై, ♦ సొబగొందు ముసుగోళ్ళు,
వల్లెఁ బారియుఁ గాంతి ♦ దుల్లఁ బోవు;
గీ. మృత్యుదేవత, నినుఁ గెల్వ ♦ నిచ్చగించి,
శ్వసనధనముదు హరియింపఁ ♦ జాలెఁ గాని,
భవ్య వదనీయ రూపమై ♦ భవము నైని,
పూర్ణజయ మంద లేఁ డయ్యెఁ ♦ బూవుబోఁడి.

నీ కిష్టముఁ లేకయే నీపాణిఁ బట్ట నెంచిన యా వృద్ధుని వలె, నీ మృత్యుదేవుండును, నిన్ను మోహించి, బలాత్కారముగ లాగికొని పోయినాఁడు కాఁబోలు. ఎన్ని కష్టములొందినయైన నన్నే పెండ్లియాడ నెంచిన నిన్ను నే నొంటిగా విడనాడఁ గలనా? దుష్టుఁడగు నా మృత్యురాక్షసుఁడు ని న్నెన్ని యాపదలపాలు చేయునో కదా! నేనుఁగూడ నీవెంటవచ్చి యాతని నెదిరించుటకు నీకుసాహాయ్య మొనర్చెదను. నేను మాత్రము కృతఘ్నుఁడ నగుదునా? ... ... ... ... ... అట్టి సరోజినిని, నాచేతులార, మృత్యువు పా లొనర్చితినే?

సీ. తేనియల్ చిప్పిల్లు ♦ తీయని నీ పల్కు
కోరి వింటిమంటినే ♦ కీరవాణి;
వెన్నెలంబోలు నీ ♦ చిన్నినవ్వును జూచి,
మురిసితి, ముఖజిత ♦ పూర్ణచంద్ర;
బంగారుతీఁగ నాఁ బరఁగు నీ నెన్నడుము
నడుమ నెంచుచు నుంటి, ♦ శ్యామలాంగి;
కలదు లే దను రీతి ♦ నలరు కౌనును జూచి,
యుంపొందుచుంటి సిం ♦ హోదరీమధ్య;
గీ. బాటలంబౌరు చేతులం ♦ గేరు పేశి

సొరుఁగారి పల్కుచుంటిని, ♦ భామకేశి,
వాఁడిమాటల కోలల ♦ వలన నలఁతిఁ
జెందుచుంటిని, దృగ్వినిర్జిత మృగాళి.

సీ. ముద్దుఁగపు లేనవ్వు ♦ నవ్వ నేర్చిన నాఁడె,
నను నవ్వుచుంటివే, ♦ నాతిమిన్న!
జిలిబిలి పల్కులఁ ♦ బలుక నేర్చిన నాఁడె,
నను బిల్చు చుంటివే, ♦ వనజ నయన;
తడఁబడు కాళ్ళతో ♦ నడువ నేర్చిన నాఁడె,
నను జేరుచుంటివే, ♦ నలిననేత్రి;
పలుముద్దు పాటలఁ ♦ బాడ నేర్చిన నాఁడె,
నను బాడు చుంటివే ♦ నవసుమాంగి;

గీ. చదువు, సాములు, ♦ నేర్చిన సమయములను,
నన్నుఁ బాయక యుంటివే, ♦ నాదు కలికి,
నిముసమైనను, నెడఁబాసి ♦ నిలువ లేక,
నన్ను వెదకుచుంటివే, ♦ నాదు చెలియ.

పుడమిపైఁ గాలూనిన దాదిగ, నట్టి యవ్యాజానురాగము నాపైని నిల్పుటయే కాక, చిట్టచివరకు నా కట్టి యుపకారము చేయ నెంచితివో, యది దైవమే యెఱుఁగును గదా.

ఉ. కల్లరిమాయలం దగిలి, ♦ కాఱియ లొందుచు నున్న నన్ను, నీ
వల్లనఁ బ్రోచినం గాఁ దలఁచి, ♦ యాకలి దప్పి యెఱుంగఁ బోక, నీ
తల్లిని, దండ్రినిన్ విడిచి, ♦ తల్పకరన్ జతనం బొనర్చి నా
వెల్లవిధంబులన్; భవద♦హీన దయామతి నెన్న నేర్తునే!

నా కట్టి మహోపకార మొనర్చిన నీవే యీ లోకమును విడచిపోవుచున్నప్పుడు, నే నింకఁ బ్రదుకుట యెవరికో

కామవర్ధన! నన్నుఁ గామింప నటనైన,
నీ జాడ నే నెంచు • నియతి తోడ;
గాంగేయభూషణా! • కనుము నన్నింకైన,
నీదాయ సరుదెంతు • నిజము తోడ;

గీ. చారుసుకుమార, మార, రంజన! శుభాంగ!
హృదయాధనమును నీకె యర్పింప లేదె?
సరస రసికప్రియాకార • ధరుని, నిన్ను
విడచి నిర్వంగ నేర్తునే, • ప్రమదలోన.

సీ. అతిమనోహరగాత్రుఁ • డౌ పతిభిక్షకుఁ గ్రైన,
పొందిచెందిన యట్టి • రూపవతిని;
మహియం దనన్య సామాన్యమై యలరారు
హిందూసతీ గుణ • హేమవతిని;
మనసు నెవ్వనికి సమర్పన సేసితివో, వాని
దరిని నిల్చినయట్టి • ధర్మవతిని;
ధనలాభమును జూపి, • నిను గోరు వారు వైరి,
నెనరు జూపని యట్టి నీతిమతిని;

గీ. అబలనైనను బరదేశమందు నిలిచి,
యైనఁ బతిభక్తి మానని • మానవతిని;
ఎన్ని కష్టములం బొంది • యేని, ప్రాణి,
ప్రియునిఁ బ్రోవ నెంచిన సుచరిత్రి నహహా!

అయ్యయో! సరోజినీమూను నాకేల?

ఓతలిదండ్రులారా !

సరో.— (లేచి సంభ్రమముతో) చనిపోయిన నేనింక నెట్లు బ్రతికియున్నాను? భూతము నైతినా? ఇదియేమి? కారాగృహమే! ఇక్కడ నెవ్వరున్నారు? ఎవరో ఒక స్త్రీ పొడుచుకొని పడినది కుముదినిగా యుండునా?

కుము.—(మందస్వరముతో, నిద్రనుండి లేచితివా, నీవైన జీవింపుము.

సరో.—ఏమీ, నిద్రయా? మృతి కాదా?

కుము.—ఓషధి-క్షీరము-నిద్ర—క్షమింపుము. (చనిపోవును).

సరో.—ఏమీ! ఓషధీ ప్రభావమున నేను చనిపోవుటను మృతిగా భావించితినా? అట్లయిన నాహృదయేశుఁ డెక్కడ? (వెదకి) అయ్యయ్యో! అతఁడు కూడ నిక్కడనే పడియున్నాఁడు. నేను నిజముగానే చనిపోయితినని యీతఁడు కూడ భ్రమించి, స్వయంవధ నొనర్చుకొన్నాఁడు. కటకటా! యెంత పాపకాలము? ఓ కుముదిని! యిది యంతయును నీద్రోహమువలననే వచ్చినది. చనిపోయిన కుముదినిని నిందించుట యేల? నావలెనే యదియును ప్రభాకరునికై యే, ప్రాణమర్పించినది. ఆడువాండ్ర హృదయము లెల్లప్పుడు నద్దమువలె నిష్కళంకము లైనవి. చూచువారల యూర్పులవలననే, మలినము లగుచుండును. స్త్రీలు సహజకళంకలను వారు మూర్ఖులు. ఓ ప్రాణేశ్వరా! ఏ నిన్ను దైవముగా నెంచుచున్నానో, యా నీవు నాకై యెంతకష్టము భరించినావు?

సీ. కనుఁగొని కాముని ♦ క్రొవ్విన్నాస్త్రలో గాల్చి,
　　స్వాంత కాంతా సేవం♦బు దుష్కృతిలోఁకి;
పండారకాది కృ♦త్యములు చేయఁగ సాగి,
　　పాత్మతీ నిద్రితో ♦ శ్రీమదు నాఁగి;
నీవ మానవ కరా♦నీత నీరము తాల్చి,
　　స్నాన సంధ్యాది నై♦త్యమున వేఁ;
చటుల దుర్మార్గ సం♦చారు లంపటు రేఁగి,
　　యాచరించుచు నున్న♦యట్టి నేఁగి;

గీ. యంతయును భరించు టెట్లు నా♦యందు నీకుఁ
గలుగు నవ్యాజ నైజాను ♦ కంపగాదె?
నాప దైవంబవౌ నీవు ♦ నన్గటించి,
యుసురులం బాయ, నే నిల్చి ♦ యుండఁగలనె?

సీ. గౌరీమనోహరా ♦ గమన చేసిన నైన,
　　నన్ను గొంపోవుము ♦ నామనోజ్ఞ!
కమలామనోహరు ♦ గాన నేగిన నైన,
　　నన్నుఁ గొంపోవుము ♦ నా హృదీశ;
వాగధీశ్వరుఁ జూడ ♦ నేగిన నైనను,
　　నన్నుఁ గొంపోవుము ♦ నా విభుండ;
జ్యోతిస్స్వరూపు ని♦ జూడఁగా నేగిన
　　నన్నుఁ గొంపోవుము ♦ నా సఖుండ;

గీ. నన్ను నీవెంటఁ గొంపోయి ♦ నాకు లోక
మఖిలమును జూపు మృదు హృద♦య నవనీత,
నవ్యరాగముతో నిందు ♦ ననిచి నట్లు,
కరుణతోఁ జూడు మెంతయు ♦ గానమూర్తి

సీ. చెలిమి చూపెదు నీదు • శ్రీరంగ మేరాగ
మనుచు నెంచుచు నుంటి • ప్రాణనాథ!
సుపంద్మైన నీ • కళ్యాణి కాంకార
మాకార మనియంటి • ప్రాణనాథ!
తులలేక యలరు నీ • తోడి నెయ్యమె నెయ్య
మని యెంచుచుంటిని • ప్రాణనాథ!
మురిపెంబు నింపు నీ • మోహన హస్తముల్
హస్తంబు లంటిని • ప్రాణనాథ!

గీ. మనుజ దూరము, పరమ హం•సధ్వాని ప్ర
చార మగు నాకలోక వి•స్తార మరయ,
గాంక్ష చేసితి నీతోడ, • గానడాయ
నరయ నను దీసికొని పొమ్ము • ప్రాణనాథ!

(తెరలో కలకలము).

అదిగో! మనుష్యుల యలుకు డగుచున్నది. ఓ ఖడ్గమా! కఠినమగు వారలోకొక్కఁడు లోకమున కుపకారమే చేయునను నానుడి సార్థకము చేయుచున్నావు. నాకు ప్రాణహరణము-కాదు-భరణము,-ఏదియైన నొక్కటియె— వేగమె యొసంగుము.

(పొడుచుకొని పడిపోవును).

హా! ప్రభాకరా!! ప్రభాకరా!!!— (చనిపోవును).

[పద్మలత, సాగరుఁడు, సంధ్యాదేవి, అరుణాచలశాస్త్రి నవాబును ప్రవేశింతురు.

తక్షణమే తెరజారును. నవాబుముందరకువచ్చి,]

ఎంతఘోరము జరిగినది! మహమ్మదీయుఁడ నగు నాకే జాలి యగుచున్నది. కుముదినీసరోజనీ ప్రభాకరుల చరిత్రమువంటి కరుణరసప్రధానమగు చరిత్రము నింతకు ముం దెన్నఁడైనను జూడలేదు. దీనినిగురించి యాలోచింపవలయును.

(నిష్క్రమింతురు).

# తప్పొప్పులు.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| అవతారిక | 2 | నియమములు. | నామకరణము |
| 9 | 3 | సర్వ్యజన | సర్వజన |
| 11 | 13 | పెట్టింబెట్టి | పెట్టెంబెట్టి |
| 22 | 14 | బొరిగ పట్టుకొని | బొరిగొట్టుకొని |
| 26 | 17 | అమో్య | అయో్య |
| 27 | 7 | చేయుచు | చేయు |
| | 20 | రూపాలు | రూపాయిలు |
| 31 | 4 | పోవును | (పోవును). |
| 36 | 15 & 16 | కొనియుస్తాను | కొనిస్తాను |
| | 24 | మరచి | మరిసి |
| 39 | 18 | యూడి | ఞూడీ |
| 42 | 11 | పదిరెకెక్కువ | పదిరెట్లెక్కువ |
| | 13 | తోమ్మిది | తొమ్మిది |
| 46 | 4 | ఘోమము | మోహాము |
| 52 | 10 | సార్థమే | నైజమే |
| | 25 | యొక్కటి | వొక్కటి |
| 54 | 17 | వచ్చెదరా | వస్తారా |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 56 | 12 | ఆయ్యో | అయ్యో |
| | 18 | రాకున్నదో | కానున్నదో |
| 64 | 16 | నేనెంతని | నేనెంత |
| 65 | 9 | మధ్యన | మధ్యమున |
| 70 | 1 | జూచు | జూచుచు |
| 74 | 23 | యుంటే | వుంటే |
| 75 | 5 | కర్చులైనా | కర్చుకైనా |
| 77 | 3 | యన్య | నన్య |
| | 6 | బోయినది | బోవునది |
| 78 | 1 | సంపయున్నదో | సంపదయున్నదో |
| 84 | 1 | తరుణో | తరణో |
| 90 | 13 | నార్జన | నార్జవ |
| 91 | 17 | ఎపుడు | ఎవుడు |
| 93 | 3 | యుపకారము | యుపకారము |
| | 16 | జెరలోన | జెరలోన |
| 95 | 19 | కోట్టేవరకు | కొట్టువరకు |
| 98 | 2 | టకొట్టి | టికెట్టి |
| 101 | 10 | మగఁడేల | మగండేల |
| 113 | 13 | దుర్మార్గులారా | దుర్మార్గురాలా |
| 116 | 5 | బోమెదము | బోవుదము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 118 | 12 | సాంధ్యరాగముల్ | సాంధ్యరాగముత్ |
| 124 | 21 | తనలో | (తనలో) |
| 132 | 8 | Nil | (సరోజినివంక దిరిగి) |
| | 18 | మానవతివి | మానవతివి |
| | 20 | సుచరిత) | సుచరిత్ర |
| 133 | 10 | యొయ్యెడ | యొయ్యెడ |
| | 21 | వంశలై | వంశ్యలై |
| 134 | 9 | నేను చనిపోవుట | (గలిగిననిద) |
| | 11 | (వెడలి) | (వెనుకకు దిరిగిచూచి) |
| 136 | 12 | కొనిబొమ్ము | కొనిపొమ్ము. |

ఇంకను సూక్ష్మదృష్టిని చూచిన నచ్చు తప్పులు కాన వచ్చునేమో.

# ఉషఃకాలము.

## ప్రథమ మరీచి.

క. 'కలభాషిణి' యను పేరను, వలనాంధ్రకవిత్వ కాంత యాత్మచరిత్రం
బలఘుప్రక్రియఁ దనకొప్పు, చలమున దెలియంగఁ జేసెఁ బ్రోన్నత లీలన్.

మ. నవలారూపముగా, మనోహరముగా, నానా రసోల్లాసిగా
నవలావణ్యయుతంబుగా నెసఁగ, నాంధ్రంబందు, సంస్తూయమా
న వచఃప్రౌఢిమఁ జేయఁగా బడిన, గ్రంథం బిద్దియే యంచు మా
నవనాథుల్ కవినాథులున్ దెలిపి రానందంబు సూచించుచున్.

ఇది యాంధ్రభాషకు నూతనాలంకారమగు నొక వచన కావ్యము. ఆంధ్రకవితాసతి తన చరిత్రయంతయుఁ గలభాషిణి యను పేరఁ దనకుమారులగు నాంధ్రులకుఁ దెలియఁజేయుట. మృదుమధుర నిరర్గళశైలితో వర్ణింపఁబడినది. ఇందలి మాటల ముద్దుతనమును, వర్ణనావిశేషముల ప్రౌఢిమయు, సందర్భోచిత రసపోషణంబును గనిన నెంతమందున కైన నానందముగ నుండును. ఇందు కలభాషిణి, నన్నయం గాంచినది మొదలు నేటి దనుక పొందిన మార్పులెల్ల నతి విచిత్రముగ, హృదయరంజకంబుగ వర్ణింపఁబడినవి. ప్రాచీనకవుల శయ్యావిశేషములన్నియుఁ జర్చింపఁబడినవి. వేయేల? ఇందుఁ ద్రొక్కఁబడిన త్రోవలన్నియు, నూతనములు, ప్రౌఢములు. వ్రాయఁబడినది చరిత్రమేయయ్యును, నవలవలె జదువఁజదువ రసమొలుకుచుండును. చక్కని యచ్చులో "ఫెదరువైటు పేపరు" పై ముచ్చటగ నచ్చొత్తింపఁబడి 240 పుటలగలదు.

☞ చందాదారులకు రు. 0-14-0. ఇతరులకు రు. 1-8-0లు పోస్టేజీకాక.

గ్రంథకర్త హూణాంధ్ర భాషా పారంగతులగు, మ. శ్రీ. తాపీ-ధర్మారావుగారు బి.ఎ.

